కాళిదాసు

# కుమారసంభవం

విద్వాన్ విశ్వం

అన్నపూర్ణా పబ్లిషర్సు
విజయవాడ-2

కాళిదాసు

# కుమారసంభవం

1

# ప్రథమ సర్గ

ఉత్తర దిక్కున హిమాలయం అనే పర్వతరాజమున్నది. దేవతా స్వరూపమైన ఆ గిరి పూర్వపశ్చిమ సముద్రాలు రెంటి లోనికి చొచ్చుకొనిపోయి భూమికి కొలతబద్దవలె నున్నది. మునుపు పృథుచక్రవర్తి గోరూపంలో నున్న భూమిని చూచి దానిని పిండు డని ఉపదేశించినాడు. అప్పుడు సర్వ పర్వతములు ఆ గోవునకు ఈ హిమవంతాన్నే దూడనుగా చేసినారు. దోహ దక్షుడైన మేరువు ఆ గోవును పితికినాడు. అతి ప్రకాశమైన రత్నాలు, మహౌషధులు అప్పుడే బయల్పడినవి.

అసంఖ్యాక రత్నరాసులకు ఉత్పత్తి కారణమైన ఈ కొండలో మంచున్నా అదొక పెద్ద లోపం కాలేదు. దాని సౌభాగ్యాన్ని తగ్గింపలేదు. అనేక గుణాలలో ఒక దోషమున్నా చంద్రకిరణాలన్నీ ఉండగా ఆ కాస్త మచ్చవలె అంత పెద్ద లోపం కాజాలదు.

ఈ కొండ కొమ్ములపై అనేక ధాతువు లున్నవి. ఆ గైరికాది ధాతువుల వెలుగులుపడి మబ్బుతునకలు ఎఱ్ఱవడి పోతుంటవి. అది చూచి 'అయ్యో, సాయంకాల మయ్యేనే' అని అచ్చరలు గబగబా అలంకరించుకొన నారంభించి తొట్రుపాటు పడిపోతూ ఉంటారు.

అక్కడ ఎందరో సిద్ధు లుంటారు. వారు ఎండవేళల నీడకోసం మబ్బులు తిరుగుతున్న నితంబ భాగాలక్రింద వచ్చి

కూర్చుంటూ ఉంటారు. కాని పాపం అంతలో చినుకులు పడగనే కలతపడి త్వరత్వరగా ఆ గిరిశిఖరాలపై కెక్కిపోతారు. అక్కడ ఎండ బాగా కాస్తూ ఉంటుం దప్పుడుకూడా.

కిరాతులు ఏనుగులను చంపివైచిపోయిన సింహాలను, వాని అడుగుజాడలనుబట్టి వెన్నంటాలని చూస్తారు. కాని మంచు కరిగి పారడంతో ఆ పదరేఖలు చెడిపోతాయి. అయినా గజకుంభస్థలాలలోని ముత్యాలు ఆ సింహం పంజాలలో చిక్కుకొని దారి పొడవునా రాలి పడి ఉంటాయి. వానిని బట్టి వారు కేసరులను వెదుకుతూ పోతుంటారక్కడ.

ఈ కొండలో అనేకంగా భూర్జవృక్షా లున్నవి. ఏనుగు మచ్చలవలె ఎఱ్ఱగానున్న వాని ఆకులమీద ధాతురసంతో విద్యాధరాంగనలు ప్రేమలేఖలు వ్రాస్తుంటారు. ఆ విధంగా అవి ఉపయోగపడుతుంటాయి. ఈ గిరిదరులలో విశేషంగా వెదురుపొద లున్నవి. ఆ బొంగులలోనికి గాలి దూరి శబ్దిస్తూ ఉంటుంది. అందుతో పాడుతున్న కిన్నరుల కీ పర్వతం శ్రుతి వేస్తున్నదా అనిపించును.

ఎక్కడ చూచినా ఈ గిరిపై దేవదారు తరువులు కానవస్తాయి. అలాగే అత్యధికంగా ఉన్న వనగజములు తమ కపోల కండూతిని తీర్చుకొనడంకోసం ఆ సరళవృక్షాల కొమ్మలకువేసి రుద్దుకుంటాయి. అందుతో వానిలోనుండి పాలు స్రవించి ఈ కొండచఱియ లన్నింటినీ సువాసనలతో గుబులుకొన జేస్తాయి.

ఆ గిరిదరీకందరాలలో వనచరులు వనితలతో క్రీడిస్తూ ఉంటారు. అక్కడ రాత్రులందు రకరకాల ఓషధులు వెలుగుతూ ఉంటాయి. అవే వారికి నూనె నింపవలసిన అవసరం లేని దీపాలుగా వినియోగపడుతుంటాయి.

అక్కడ మంచు గడ్డకట్టుకొని పోతుంది. అందులో నడిచే కిన్నరాంగనలకు ఆ మంచు తగిలి కాలివేళ్లు, మడమలూ విపరీతంగా బాధపడతాయి. అయినా పాపం తమ నితంబభారంతోను, పయోధర భారంతోను గబగబా నడవలేక మామూలు మందగతినే నడుస్తుంటారు.

పగటికి భయపడిన అంధకారం సూర్యుని నుండి తన్ను రక్షించమని శరణు చెందగానే కావచ్చు తన గుహాలలో దాచుకొని ఈ పర్వతం కాపాడుతున్నది. ఎంత క్షుద్రుడైనా శరణన్నవానిపై సజ్జనునియందువలెనే గొప్పవారికి మమకారం ఉదయించడం సహజమే.

అక్కడ చమరీమృగాలు తమ కుచ్చుతోకల నటునిటు త్రిప్పుతూ అందాలు చిందిస్తూ ఉంటాయి. చందమామ వెలుగులవోని తమ వాలవ్యజనాలతో వీచుతూ అవి హిమవంతం గిరిరాజన్న పేరును సార్థకం చేస్తుంటాయి. ఆ గుహాలలో కింపురుష మిథునాలు క్రీడిస్తుంటారు. కాంతులు తమ అంశుకాలను లాగివేయగా సిగ్గుపడిపోతున్న కాంతలకు యాదాలాభంగా ఆ గిరిదరీ గృహద్వారాలముందు వ్రేలాడే మబ్బులు వారికి తెఱలుగా పనిచేస్తుంటాయి.

మృగాలను వెదుక్కుంటూపోతూ అలసిపోతున్న కిరాతులకు గంగానదీ శీకరాలతో చల్లబడి, దేవదారు తరువుల తాకిడితో సువాసితమై, నెమలి పురులను విదిల్చి మందగతి నంది మందమారుతం అలత తీర్చునదిగా అక్కడ వీస్తూ ఉంటుంది.

అది మరీ ఉన్నత శిఖరాలుగల పర్వతం. కాబట్టే ఆ ఉన్నత శృంగాలపైనున్న సరోవరాలలోని కమలాలను సప్తర్షులు కోసుకొని పోతుంటారు. మరి అంతకంటె క్రిందుగా తిరుగుతున్న సూర్యుడు పైకి ప్రాకే తన కిరణాలతో మిగిలిన అందలి కమలాలను వికసింపజేస్తూ ఉంటాడు.

యజ్ఞాంగాదులైన సోమలతాదులక్కడే దొరుకు తుంటాయి. పైగా భూభారవహనంలో ఆ గిరిరాజు సమర్థుడు. అందువల్లనే ప్రజాపతి హిమవంతునకు యజ్ఞంలో భాగం కల్పించి, కొండలకెల్లా రాజునుగా ఆయనను ఏర్పాటు చేసినాడు.

ఆ హిమవంతుడు తన వంశం నిలబెట్టుకొనుటకై మేరు సఖుడైన తాను పితృదేవతల మానస పుత్రిక, మునులకునుండి గౌరవనీయురాలు అయిన మేనక అనే అనురూప కన్యను శాస్త్రోక్తంగా పెళ్ళాడినాడు. కాలక్రమంగా స్వరూపయోగ్య సురత ప్రసంగం నడవగా మనోహర యౌవన సుశోభిత అయిన మేనక గర్భవతి అయినది.

ఆమెకు మైనాకుడనే కుమారుడు కలిగినాడు. అతడు సముద్రునికి పరమ స్నేహితుడయినాడు. అందువల్లనే

ఆయన ఆశ్రయంతో కొండలపై కోపంతో రెక్కలు విఱుగ నుంకించిన ఇంద్రునివజ్రాఘాతాల నాయన అనుభవించనేలేదు.

ఈశ్వరుని తొలిభార్య సతి. ఆమె దక్షప్రజాపతి కూతురు. తండ్రి అవమానింపగా యోగధారణతో దేహత్యాగం చేసిన ఆ సతి పునర్జన్మ యెత్తదలచి ఈ మేనకాదేవి గర్భంలో పడినది.

అలా హిమవంతునకు నియమవతి యగు మేనకకు భవ్యరాలైన కూతురు పుట్టినది. సరిగా ఉపయోగించుటతో అపరిక్షతమైన నీతి ఉత్సాహ గుణంతో ప్రేరితమై సంపదకు కారణ మగునట్లుగా హిమవంతుడు మేనకలో ఆమె జన్మకు కారణమైనాడు.

ఆ పుట్టినరోజున దిక్కులన్నీ ప్రసన్నముగా నున్నవి. గాలి పరిశుభ్రంగా రజోదూరమై ఉన్నది. శంఖస్వరాలు, ఆవల పుష్పవృష్టి ఆనాడు కురిసినది. ఈ విధంగా స్థావర జంగమాత్మక జగత్తు యావత్తూ ఆరోజు హాయి ననుభవించినది.

మేఘగర్జనలతో వైదూర్యభూమిలో రత్నాంకురాలు కలుగుతూ ఉంటాయి. అలాగే పుట్టిన ఈ పాప వెలుగులు చిందుతూ తన తల్లిని మిగుల ప్రకాశింపజేసినది.

అలా జన్మించిన ఆ చిన్నది చంద్రరేఖవలె దిన దిన ప్రవర్ధమాన అవుతూ కళలను వృద్ధి చెందించుకుంటూ అనేక లావణ్య విశేషాలకు కారణమైనది. ఆనుపూర్విగా వచ్చిన పేరుతో బంధుగులా పాపను పార్వతి అన్న పేరుతో పిల్చే

వారు. ఆ తర్వాత తపస్సునకు వెళ్ళ కుమా (ఉ-మ) అని తల్లి అనుటతో ఉమ అన్న పేరుకూడా ఆమెకు వచ్చినది.

హిమంతుడు చాలమంది పిల్లలున్నవాడే. అయినా, ఆ పార్వతిపైనే తీరని మక్కువ. వసంతంలో కావలసినన్ని పూలు పూస్తాయి. కాని, ఆ కాలం తుమ్మెదల కొక్క మావిపూతయందే వల్లమాలిన వలపుతోలకనుగదా! అధిక ప్రకాశవంతమైన జ్వాలతో దీపంవలెను, ఆకసం ఆకాశ గంగతో వలెను, సంస్కారవంతమైన వాక్కుతో విద్వాం సునివలెను ఆ పార్వతిచే హిమవంతుడు ప్రపూతుడు, ప్రభూ షితుడు అయినాడు.

బాల్యంలో ఆ పాప చెలికత్తెలను చేర్చుకొంటుంది. వారితో కలిసి క్రీడారసాన్ని తనివితీరా అనుభవిస్తూంది. గంగా నదీ యిసుక తిన్నెలలో ఆడుకుంటుంది. బంతులతో బొమ్మ లతో పలుమారులు క్రీడాసక్త అవుతుంది.

తగిన వయసురాగానే ఆమెను చదువవేసినారు. అందుతో పూర్వజన్మార్జితాలైన విద్య లావిడలో పునరుద్బుద్ధా లయినవి. శరత్తులో గంగానదిని హంసలు చేరుకొన్నట్లుగా రాత్రిలో మహౌషధులను వాని ప్రదీప్తి పునస్సంగతమైనట్లుగా ఆ విద్య లామెను తిరిగి సమాశ్రయించినవి.

అలా బాల్యం గడవగనే ఆ పార్వతిలో ప్రాయం తల చూపింది. శరీరానికి పెట్టని అలంకారమూ మదన ప్రభూతికి ఆసవాతిరిక్తమైన ఉత్తేజనమూ, కామునికి పుష్పేతరమైన బాణమూ అయిన యౌవనం ఆమెలో అంకురించింది.

తూలికతో ఉన్మీలనం చెందిన చిత్రరువులా, సూర్య కిరణాలతో విరిసిన పద్మంలా, నవయౌవనంతో ఆ కన్నె ఒడలు నాలుగంచులూ తీరి నవనవలాడసాగినది.

ఆమె అడుగులు మెట్టతామరలవలె సొగసులు వోయి నవి. నేలపై నడుస్తుండగా ఆ ఒత్తిడితో తమలోని రక్తిమను వెడలగ్రక్కుతున్నవేమో అన్నట్టు ఎత్తైన ఆవిడ పాదాంగుష్ఠాల నఖకాంతులు వెలుగొంద సాగినవి.

తమవిద్య నావిడకిచ్చి, ఆమె సొబగును తాము పొంద దలచినవేమో రాయంచలు తమ నడకల సొబగును పార్వతికి నేర్పినవి. మరి ఆమె పాదనూపురాల శింజితాలను తాము నేర్చుకున్నవి.

ఆదోకవలె గుండ్రంగా, రాను రాను సన్నవడుతూ అతి దీర్ఘాలుకాని ఆమె పిక్కలు శుభలక్షణ పరిశోభితాలుగా నున్నవి. తన వద్దనున్న లావణ్యాన్నంతటిని వినియోగించి వాని నొనరించిన బ్రహ్మ, పాపం మిగిలినవానికి తగిన సొగసు కోసం వెంపర్లాడుతున్నట్లున్నాడు.

ఆ పార్వతి తొడలను అందంలో ఆకారంలో ఏనుగు తొండములతోను, అరటి కంబాలతోను ఉపమించవలసిందే. కాని, ఏనుగుతొండాలపై చర్మమేమో మరీ కర్కశంగా ఉంటుంది గనుకా, అరటికంబాలు లోన అతి శీతలం కలవి గనుకా అలా ఉపమించుట కవి నోచుకొనలేదు.

ఆమె మొలనూలు వ్రేలుతావెంతగొప్పదో ఊహించు కొనడాని కొక మార్గమున్నది. ఆతర్వాత ఇతరస్త్రీ లెవ్వరికి

లభ్యంకాని శివుని తొడపై ఆ భాగం ఆరోపితమైనది. ఈ మాత్రం చాలు ఆవిడ నితంబశోభ ఎంతగొప్పదో చెప్పడానికి! నాభి బిలంలో ప్రవేశించిన ఆ కన్య నూగారు పోకముడిని దాటి ఎలా ఉన్నదని! తన మేఖలలో నడుమనుంచుకున్న నీలమణి రోచిర్నివహం వలె నున్నదది.

ఆమె కుచద్వితయం ఒకటి నొకటి ఒరుసుకుంటూ విరిసినది. అతి ధవళమై శ్యామముఖమై ఉన్న ఆ చనుగవ నడుమ బిసతంతు వుంచుటకు కూడా వ్యవధానం లేదు. మరి ఆ సుకుమారి బాహువులు శిరీష కుసుమ పేశలము లనుకుంటాను, అందువల్లనే తా నోడిపోయినా మన్మథుడు వానిని శివునికి కంఠపాశాలనుగా చేయగల్గినాడు.

స్తనబంధురమైన ఆమె కంఠంలో నిస్తలమైన ముక్తాహారం వేసుకొన్నదా—అందులో ఏది దేనికి భూషణమో చెప్పలేము. పరస్పర లావణ్యసంవర్ధకా లయిన వవి.

చంచలమనస్కయైన లక్ష్మి చంద్రునిలో పద్మగుణముల ననుభవింపలేక పోయినది; పోనీ అని పద్మాన్నాశ్రయించిందికాని, అక్కడ చందమామ చలువ విలువా లభ్యం కాలేదు. అందుతో విసింగి ఈ రెండూకల పార్వతీముఖాన్ని సమాశ్రయించి ఆ రెంటి మేలిమినీ అనుభవించగలిగినది; అందుతో ఆనందించగలిగినది.

చివుటాకులలో పూవును పొదిగితేగాని, లేదా పగడాలలో ముత్యాలను తాపితేగాని అరుణాధర పరివ్యాప్తకాంతి అయిన ఆ కోమలిచిరునవ్వుతో పోల్చవచ్చును.

ఆమె కంఠస్వరం అమృతమొలుకుతూ ఉంటుంది. ఆ మధురభాషిణి మాట్లాడితే దానియందు కోయిల గొంతుక కూడా శ్రుతిచేయక వాయిస్తున్న వీణానాదం వలె వినువారి చెవికి కఠోరంగా తోస్తుంది.

మరి ఆ మగువ కనులు కలువలే సుమా; గాలికి కదలే నల్ల కలువలను బోలే ఆ ఆయతాక్షి బెదరుచూపులు లేళ్ళ దగ్గర ఆవిడ నేర్చుకున్నదేమో! కాదా అవే ఈ కన్యనుండి పరిగ్రహించినవో చెప్పలేము.

కాటుక పుల్లతో గీసినట్లున్న పొడుగాటి ఆ ముగుద కనుబొమ లెంత విలాస చతురములని! దానిని చూచి మన్మథుడు తన ధను స్సెంతో సుందర మనుకొని పూర్వం గర్విస్తున్న వాడల్లా ఆ పొగరును వదలివేసుకున్నాడు.

జంతువులలో సిగ్గుంటుందో లేదో తెలియదు. ఒకవేళ అలాంటిదే వుంటే చమరీమృగాలా పార్వతి కేశపాశాన్ని చూచిన తర్వాత తమ వాలాలపైనున్న ప్రీతిని తప్పక వదలిపెట్ట గలవు.

సుందర వస్తువు లన్నింటినీ ఒకచోటచేర్చి ఎలా ఉంటుందో చూతామనుకున్నాడేమో ఆ విధాత! అందానికి పోలికలుగా చెప్పుకునే అన్ని వస్తువులను ఆ యా తావులలో సరిగా అమరించి ఈ కన్నెను నిర్మించినాడు కావచ్చును.

కామచారి అయిన నారదు డొకసారి హిమవంతుని దగ్గరకు విచ్చేసినాడు. అతని దగ్గరనే ఉన్న కూతును చూచి

నాడు. ప్రేమతో ఈ కన్నె హరుని శరీరార్ధమును హరించును సుమా అని ఆనతి ఇచ్చినాడు.

అందువల్లనే ప్రగల్భమైన వయస్సుతో పార్వతి మిస మిస లాడుతున్నా హిమవంతుడు మరొక వరుని వెదకవలెనని తలంచకుండా అలా ఊరుకున్నాడు. మంత్రపూతమైన హవ్యం అగ్నిని వీడి మరొక తేజస్సు దేనిలోనూ హుతం చేయ వీలు లేదుకదా!

శివుడడుగనిదే తన కూతు నిత్తునని చెప్పడానికి హిమవంతుడు సంకోచించినాడు. తమ కోరిక నిరాకృతమగునేమో నన్న భయంతో సాధువులు తమకు ఇష్టమైన విషయంలో కూడా ఉదాసీనులే అవుతారుకదా!

ఈ పార్వతే పూర్వజన్మంలో దక్షునిమీద కోపంతో తన శరీరాన్ని విసర్జించింది. అప్పటినుండి ఈశ్వరుడు విషయాసక్తిని వీటిబుచ్చి భార్యారహితుడుగానే ఉండిపోయినాడు.

ఆ కృత్తివాసుడు తపస్సు చేసుకుందామని నిశ్చయించుకున్నాడు. అందుకని గంగా ప్రవాహ నుషులొరసే తావున, దేవదారు తరువులు మొలిచిన చోటున, కస్తూరి మృగాల సువాసనలొలసే స్థలాన, కిన్నరుల పాటలు వినవచ్చే ఒకానొకహిమవంతంచరియపై తపస్సులంనిర్ణయించుకున్నాడు.

అక్కడే ప్రమథగణాలు సురపొన్నపూలను ముడుచుకొని, కోమలభూర్జత్వక్కులను కట్టుకొని, మణిసిల కలిసిన శిలాజిత్తు నిండిన కొండరాతి తావులలో కూర్చుండినారు. ఆ ఈశ్వరుని వృషభం మంచుపేరుకున్న రాళ్ళను తన ఖురాగ్రా

లతో ప్రవృచూ దర్పమనోహరమైనదై సింహంవలె గర్జించినది. దానిని చూచి గవయమృగాలు భయభ్రాంతులైనవి; ఆ ధ్వని వినుటకు తగిన తాలిమి కూడా వానికి లేకపోయినది.

అష్టమూర్తి అయిన శివుడు తన మూర్త్యంతరమే అయిన అగ్నిని ప్రతిష్ఠించి, సమిధలతో రగుల్కొల్పి తపః ఫలాలన్నిటికీ విధాత అయిన తానే ఏ కోరికతోనో మరి తపస్సు చేయ నారంభించినాడు.

దేవతలకు పూజ్యుడైన ఆ మహాత్ముని శివుని హిమవంతుడు అర్ఘ్యంతో అర్చించినాడు. ఆయన నారాధించడం కోసం చెలులతో పాటు నియమశీల అయిన తన కూతును నియోగించినాడు.

నిజానికి వయసులోనున్న వనిత సమాధి భంగహేతువు గనుక అందుకు విరుద్ధమైనదే. అయినా ఆ పార్వతి తన్ను సేవించుటకు శివు డంగీకరించినాడు. ఔనుమరి! వికార హేతు వున్నప్పుడు కూడా తమ మనసు చెదరకుండా ఉంచుకో గలిగినవారే కదా ధీరచిత్తు లగుదురు.

ఆ కన్య శివునికి కావలసినవన్నీ సమకూర్చ సాగినది. పూజకు పూలు కోసుకొని తెస్తుంది; వేదికను తుడుస్తుంది; నిత్యానుష్ఠానాని కవసరమైన నీటిని, దర్భలను తెచ్చిపెడుతుంది. ఇలా ఈ పనులన్నీ చేస్తూ, అందువల్ల కలిగే అలతను శివుని తలమీది నెలకందు వెలుగులతో తీర్చుకుంటూ పార్వతి శివునకు ప్రతిదినం శుశ్రూష చేయసాగినది.

ఇది ప్రథమ సర్గ.

# ద్వితీయ సర్గ

ఆ సమయంలో తారకాసురుడు దేవతలను వేధింప సాగినాడు. వారు దేవేంద్రుని తమ ముందుంచుకొని బ్రహ్మ దేవుని దర్శింతామని సత్యలోకానికి వెళ్ళినారు. వాడిన ముఖములతో వెళ్ళిన ఆ దేవతలకు, ముకుళించిన పద్మాల తోడి సరస్సులముందు ఉదయభానునివలె ప్రత్యక్షమయినాడు.

ఆ సర్వతోముఖుడు, వాగీశుడు, సర్వ జగత్తుకు సృష్టికర్త అయిన బ్రహ్మకు నమస్కరించి, అర్థయుక్తములైన వాక్కులతో దేవత లిలా ప్రార్థించినారు.

"భగవాన్, నీవు సృష్టికి ముందు కేవ లాత్మడవు. ఆ తర్వాత సృష్టిప్రవృత్తికాలంలో గుణత్రయ విభాగం పొందినవాడవు. త్రిమూర్తి రూపంతో నెగడినవాడవు. అలాంటి నీకిదే నమస్కారము. అజుడా! నీవు ఉదక మధ్యంలో విడిచిన వీర్యమే చరాచర జగత్తుకు మూలమైనది. అలా విశ్వకారణుడవని నిన్ను పెద్దలు గానం చేస్తుంటారు.

"ఒకడవే అయినా అవస్థాభేదంతో నీ మహిమను ప్రదర్శిస్తూ ప్రళయ స్థితి సృష్టులకు కారణుడవైనావు. సృష్టి కోసమనే నిన్ను నీవు రెండుగా విభజించుకొని స్త్రీ పురుష మూర్తులుగా చేసుకొన్నావు. వారే ఉత్పన్న జగత్తుకు జననీజనకు లయినారు. నీ బ్రహ్మకాల ప్రమాణంలో ఏర్పడిన

రాత్రింబవళ్ళే అవే నీవు నిద్రపోయే, మేల్కొనే కాలములు. అవే భూతప్రళయానికీ, సృష్టికీ హేతువులు.

నీవు లోకానికి కారణుడవు. కాని నీకు కారణ మెవరూ కాదు; జగత్తులకు అంతకుడవు నీవు, కాని నీకు అంతం లేదు. జగత్తునకు ఆది నీవు, కాని అనాదివి. జగత్తునకు ఈశ్వరుడవు నీవు, కాని నిరీశ్వరుడవు నీవు. నిన్ను నీవే తెలుసుకుంటున్నావు. నిన్ను నీవే సృష్టించుకుంటున్నావు. నీలో నీవే లయమొందుతున్న కృతివికూడా.

నీవు ద్రవరూపుడవు, కఠిన రూపుడవు; స్థూలుడవు సూక్ష్మమవు; లఘువూ గురువూకూడా నీవేనయ్యా. వ్యక్తుడవు అవ్యక్తుడవు కూడా అయిన నీవు అణిమాది రూపములలో యథేచ్ఛగా ఇష్టంవచ్చినదానిరూపంలోవ్యక్తుడవవుతుంటావు.

ప్రణవం ఆరంభంగానూ, ఉదాత్తా నుదాత్త స్వరిత ముచ్చారణములుగానూ, కర్మ యజ్ఞంగానూ, ఫలం స్వర్గం గానూ ఉన్న వేదములకు నీవు కారణమవు. పురుషార్థ ప్రవర్తిని అయిన ప్రకృతివి నీవే నంటారు. ఆ ప్రకృతిని దర్శిస్తూ ఉదాసీనంగా–తటస్థుడుగా–ఉండిపోయే పరమ పురుషుడవు నీవు.

నీవు పితరులకు పితవు; దేవతలకు దేవతవు; పరాత్పరుడవు. సృష్టికర్తలకే సృష్టికర్తవు. హవ్యము హోతా కూడా నీవే. భోజ్యం భోక్తకూడా నీవే. తెలియువాడవు, తెలియబడువాడవుకూడా నీవే. ధ్యానించువాడవు, ధ్యేయము కూడా నీవే. నీవు పరుడవు, శాశ్వతుడవు."

సత్యప్రియవాక్కులతో అలా వారు స్తుతింపగా విని ఆ విధాత ప్రసన్నుడై ఇట్లా ప్రత్యుత్తర మిచ్చినాడు. ఆ పురాణ కవి నాలుగు ముఖాలా వెలువడిన చతుర్విధములయిన-ద్రవ్య గుణ క్రియా జాతి భేదములుగల శబ్దముల ప్రవృత్తి సార్థకమైనది.

"ఓ ప్రాజ్యవిక్రములారా! మీరు మీ మీ అధికారాలను స్వశక్తి సామర్థ్యాలతో నిర్వర్తిస్తూ ఒక్కమారే కలిసి విచ్చేసినారు. యుగబాహువులగు మీకు స్వాగతం.

ఇదేమి టిలా మీరు మంచుపడి మాసిన తారకలవలె వాడిన మోములతో నున్నారు. పూర్వమువలె మీరు తేజోవంతులుగా లే రెందుచేత ?

ఇంద్రధనుస్సువలె మిలమిలా వెలుగులీనే ఈ వృత్రహంత ఇంద్రుని వజ్రాయుధం మొన మొక్కవోయినట్లు కాన వస్తున్న దేమి ? ఈ వరుణునిచేతనున్న శత్రువులకు దుర్వారమైన పాశం మంత్రంతో కట్టువడిపోయిన పామువలె దీనంగా ఉన్న దేమి? చేతిలో గదలేకుండా కొమ్మలులేని మొండిమ్రానువలె నున్న ఈ కుబేరు డేదో పరాభవం పొందినట్లు అది అతని మనసులో మెలుమెలులాడుతున్నట్లు తోచుచున్న దేమి ?

అదేమి టలా రంగుమాసిన దండంతో యముడు నేలపై గీతలుగీస్తూ దానిని ఆరిపోయిన కొఱవిలా తేలికపరుస్తున్నా డేమిటి ?

అయ్యో! ఆదిత్యు లిలా తమ ప్రతాపం పాడువడి చల్లబడిపోయినా రేమి ? బొమ్మలో గీసినవారిలా తమ దుర్నిరీక్ష్యతను పోగొట్టుకొన్నా రెందువల్ల?

పారుతున్న నీరు వెనుదిరిగినదంటే ఏదో అడ్డుపడినదని సులువుగా అనుకోవచ్చు. ఈ మరుత్తులు ఆగి తడబడుతున్నారంటే ఏదో వీరి వేగాని కడ్డు తగిలినదనే ఊహించవలసి వస్తున్నది.

ఏకాదశరుద్రులుకూడా తలలు వంచుకొని చంద్రవంకలు ప్రేలుతుండగా వారికత్తులు మొక్కపోయినట్టున్నారేమి?

పూర్వం మీరందరూ లబ్ధప్రతిష్ఠులు. అలాంటివారు మీకంటె బలవత్తరులైన విరోధులతో సామాన్య విధులు విశేష విధులతోవలె కించపడిపోయినారా?

ఇంతకూ వత్సలారా! మీరే మడగడంకోసం ఇట్లా వచ్చినారు? చెప్పండి. సృష్టిబాధ్యత నాదైతే, దానిని రక్షించేబాధ్యతంతా మీపైనే ఉన్నది."

అని ఈ విధంగా బ్రహ్మదేవుడు దేవతల నడిగినాడు. అప్పు డింద్రుడు మందానిలంతో సంచాలితమైన కమలాకరం వంటి తన వెయ్యి కన్నులతో బృహస్పతిని చెప్పమని సైగ చేసినాడు.

ఇంద్రుని వేయికన్నులకంటె విశిష్టమయినకన్ను, రెండే కన్నులుగల బృహస్పతి అంజలిబద్ధుడై బ్రహ్మతో ఇలా విన్నవించుకున్నాడు.

"అవును భగవాన్ మా అధికారాలను పరులాక్రమించుకున్నారు. సర్వాంతర్యామివైన నీకు తెలియని దేమున్నది? నీ విచ్చిన వరములతో కన్నుదెలియని తారకా

సురుడు, లోకాలకు ఉపద్రవం తెచ్చి పెట్టడంలో సంపూర్ణ ధూమకేతువులా ఉన్నాడు.

"వానిమాటకు తిరుగులేదు ప్రభూ! సూర్యుడు వాని నగరంలోని నడబావులలోని కమలాలు వికసించుట కెంత ఎండ కావలెనో అంతే ఎండ కాస్తున్నాడు. చంద్రుడు సర్వదా తన సకల కళలతోను వానినే సేవిస్తున్నాడు. శివుని సిగపూవైన చంద్రకళనుమాత్రమే అత నుపసంహరించుకొనడం లేదు, అంతే.

"పూలు దొంగిలించెనని ఎక్కడంటాడోనన్న భయంతో వాని ఉద్యానంలోకి అసలు వెళ్ళకుండా వాయుదేవుడు విసన కఱ్ఱ వీచినట్టుగా మెల్లగా ఆతోట కీవల మాత్రమే కాస్త వీస్తూ ఉంటాడు.

"ఋతువులు ఒకదాని వెనుక నొకటి రావడం మాని వేసి వానికి కావలసిన పూలన్నీ సంతరించడంకోసం తోట మాలీలవలె అన్నీచేరే వానిని ఎల్లకాలం సేవిస్తున్నవి. వాని కివ్వడానికి తగినట్టు తన నీటిలోని రత్నా లెప్పుడు సమగ్ర పరిణతినందునా అని సముద్రుడు నిరంతరం ప్రతీక్షిస్తుంటాడు ప్రభూ!

వాసుకి ప్రముఖులైన నాగులెల్లరూ తమ పడగలలో మణులు వెలుగుతుండగా వానికి రాత్రులలో ఆరని దీపాలుగా సేవ చేస్తున్నారు. వాని అనుగ్రహం సంపాదించడం కోసం ఇంద్రుడుకూడా తన కల్పవృక్ష మిచ్చిన నగలను నాణ్యాలను దూతలతో వానికి కానుక లంపుతున్నాడు.

ఇంతగా వాని నారాధించినా తను ముల్లోకాలను క్షోభ పెడుతున్నాడు స్వామీ! దుర్జనుడు దెబ్బకు దెబ్బ తీసి నప్పుడే శాంతిస్తాడుకాని మరింత ఉపకారంచేస్తే వాడెన్నటికీ తగ్గడు కదా!

పూర్వం కోమల కరాగ్రాలతో సురకోమలులు బహు సున్నితంగా కల్పద్రుమాల చిగుళ్ళను చిదిమేవారు. ఇప్పు డేమో పాపం ఆ చెట్లకు గొడ్డలిపెట్లు తప్పడంలేదు

వాడు నిదురిస్తున్నప్పుడే కాస్త మనసువిచ్చి ఏడ్చుట కైనా వాడు చెఱపట్టిన సురకాంతలకు వీలవుతున్నది. తమ కన్నీటి చినుకులతో తడిపి, తమ ఊర్పులకంటె మెల్లగా వింజా మరలు వీచుతూ ఆ బందీలు వానికి ఉపచారం చేస్తున్నారు చతురాననా!

ఒకప్పుడు సూర్యాశ్వఖురపాటితములవుతూ వచ్చిన మేరుగిరిశిఖరాలను వాడు పెల్లగించుకొనిపోయి తన ఇళ్ళలో క్రీడాపర్వతాలనుగా ఉంచుకొంటున్నాడు. మందాకినిలో నిప్పుడు మిగిలినదెల్లా దిగ్గజాలు కలచిన నీరుమాత్రమే. అందలి బంగారు తామరపూలన్నీ వానింట దిగుడుబావులలోనే పెరుగుతున్నవి.

ఇప్పుడు దేవతలు లోకాలు చూడాలన్న అసక్తినే వదలివేసుకున్నారు. వాడెక్కడ వచ్చిపడి దారిలో కొట్టునో అన్న భయంవల్ల విమానమార్గమే పాడువడిపోయినది ప్రభూ.

యజ్వలు యథావిధిగా యాగాలలో హవ్యం వ్రేల్చుతున్నారు. కాని అగ్నిముఖంనుండి వాడా హవ్యాన్ని మేమలా ఏమీ చేయలేక చూస్తుండగా అపహరించుకొని పోతున్నాడు.

ఇంద్రుని చిరకాలార్జిత కీర్తి రూపుగొన్న విధంగా నున్న ఉచ్చైశ్శ్రవాన్ని అశ్వరత్నాన్ని వాడు కాజేసినాడు. ఆ క్రూరుని విషయంలో మే మెన్ని సామాద్యుపాయాల నుపయోగించినా సన్నిపాతంలో ఔషధాలవలె అవి ఒక్కటీ పని చేయడం లేదు.

ఏదో మహావిష్ణు చక్రమైనా వానిని చంపగలదన్న ఆశ మాకుండినది. కాని తగిలినంతనే నిప్పులుక్రక్కే ఆ సుదర్శనం కూడా వాని కంఠంలో పతకంవలె అయిపోయినది మహాత్మా ! సురగజాములను జయించిన వాని మత్తవారణా లిప్పుడు మేఘాలతో క్రుమ్ములాటలు నేర్చుకుంటున్నవి.

కాబట్టి ఓ స్వామీ, వానిపీడ వదలించుకొనుటకు మీరొక సేనాపతిని సృష్టింపవలెనని మా కోరిక. కర్మబంధాలను త్రెంచివేసే ధర్మంకోసం ముముక్షులవలె మేము వానికోసం వేచి ఉన్నాము. ఆ సేనానిని ముందుంచుకొని సురసైన్యంతో వెళ్ళి ఇంద్రుడు పరులపాలైన జయలక్ష్మిని కాలు సేతులుకట్టి తీసుకొని రాగలుగునట్లు చేయవలసినది మీరే."

ఆ బృహస్పతి మాటలు ముగియగనే బ్రహ్మ ఇలా చెప్ప సాగినాడు. ఉరుము ముగియగనే వాన కురిసినట్లు తోచిన వా మాటలు. ఆయ నన్న దిది :

"మీ కోరిక సిద్ధింపగలదు. కొంతకాలం ఓపికపట్టండి. అలాంటి సేనానిని నేను సృష్టింపలేను. ఎందుకంటే వాని సౌభాగ్యమెల్లా నా వలన నేర్పడినదే. మరి దానిని నేనే ఎలా నాశ మొనరింపగలను? విషవృక్షమైనాసరే తానే వేసి పెంచి తానే కొట్టివేయడం యుక్తంకాదు గదా?

అసలు వాడు కోరిన వరమే అది. సురలచే తనకు చావు మూడకూడదన్నాడు. అలాగేనని నేను వానికా వరమూ ఇచ్చినాను. అలా ఇవ్వడానికి కారణ మున్నది. లోకాలన్నిటినీ మసిచేసివేయగల వాని తపస్సు నాపుటకే అలా చేయవలసివచ్చినది. అందుమూలంగానే వాని తపస్సు నాపివేయగలిగినాను.

సమరసముత్సాహియై ఆ వీరుడు రణభూమిలో నిలువగా వానియెదుట నెవడు నిలువగలడు? ఆ పరమేశ్వర రేతస్సంజాతుడైన వాడొక్కడే ఆ పని చేయగలడు. ఆ పరమేశ్వరుడు చీకటి కావల ఏకాకృతి వెలుగు పరంజ్యోతి. ఆయన మహిమ నాకూ విష్ణువునకూ కూడా అలభ్యమైనది.

ఇప్పుడాశంకరుడు తపోనిష్ఠలో చిత్తము నుంచి ఉన్నాడు. కావున, ఉమారూపమైన అయస్కాంతంతో లోహంవంటి ఆయన చిత్తాన్ని ఆకర్షించడంకోసం మీరు ప్రయత్నించ వలసి ఉన్నది.

నా వీర్యమును భరించుటకు ఒక్క జలమునకే శక్తి గలదు. అలాగే ఆ పరమేశ్వర రేతస్సును భరించుటకా ఉమ ఒక్కతే సమర్థురాలు. వారిరువురకు జనించిన కుమారుడు మీకు సేనాపతిత్వం వహింపగలడు. అతడే తన పరాక్రమంతో

బందీలయిన సురస్త్రీల జడలుగట్టిన వెండ్రుకలను విడదీయ గలడు."

అని ఈ విధంగా దేవతలకుచెప్పి ఆ ప్రపంచకారణుడైన బ్రహ్మదేవుడు అంతర్థానం చెందినాడు. తమ కర్తవ్య నిర్వహణాయత్తచిత్తులై సురలుకూడా స్వర్గానికి వెడిపోయినారు.

అక్కడ ఇంద్రుడు తనపని నెఱవేరుటకు మన్మథుడొక్కడే చాలినవాడని భావించినాడు. వెంటనే అందుకై మన్మథుని మనసున తలంచుకున్నాడు.

కోమలీభ్రూలతామనోహరశృంగమైన ధనుస్సును రతీదేవి కంకణచిహ్నాలు గల తనమెడకు తగిలించుకొని, తన సహచరుడైన వసంతుని చేతులతో తన మావి చివురుటమ్ము నుంచి మన్మథుడు ప్రాంజలియై ఇంద్రుని సమ్ముఖానికి విచ్చేసినాడు.

ఇది ద్వితీయ సర్గ.

## తృతీయ సర్గ

ఆ దేవేంద్రుని వెయ్యికనులూ ఒకేమారు దేవత లందరిని వదలి మన్మథునిపైనే పడినవి. ఏదో పనినిమిత్తం ప్రభువులకు ఆశ్రితులపైనున్న ఆదరాభిమానాలు అటునిటు మారడం తఱచు జరుగుతూ ఉండునదే!

తన సింహాసనానికి దగ్గరగా అతని నింద్రుడు కూర్చుండమని స్థలం చూపినాడు. ప్రభువుల ఆజ్ఞను ఔదలదాల్చి మన్మథు డతనితో ఇలా సంభాషింప మొదలిడినాడు.

"పురుషుల శక్తిసామర్థ్యాలెరిగిన ప్రభూ, నాకు లోకంలో చేయవలసిన దేమున్నదో సెలవిమ్ము. నన్ను పిలవడంతోనే మీరు నాపై అనుగ్రహం చూపినారు. మీ ఆజ్ఞతో దానిని మరెంత అధికం చెయ్యవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

చిరతపస్సంపన్నతతో నీపదవి నాకాంక్షించి ఎవడైనా తపస్సు చేస్తున్నాడా? అలా నీకు అసూయ కలుగజేస్తున్నాడా? చెప్పు. ఇదే నా విల్లెక్కిడి బాణం సంధించి వానిని నా వశవర్తిని చేసుకుంటాను.

నీకు నచ్చని వాడెవడైనా జనన జరామరణ భయంతో ముక్తిమార్గం అనుసరిస్తున్నాడా? వాని నిప్పుడే సుందరుల కటాక్షపాశాలతో బంధిస్తాను - సెలవిమ్ము.

వాడు శుక్రునివద్దనే స్వయంగా నీతిశాస్త్రం చదువు కున్నవాడైనా సరే, నీపగవాడైతే చాలు వాని అర్థ ధర్మా లను విషయాభిలాషతో చెఱచి వరదగట్టులనువలె విచ్ఛిన్నం చేయిస్తాను.

ఏ దుఃఖశీల అయిన పతివ్రతో తన అందంతో నీలోల మైన మనస్సులో ప్రవేశించినదా ? ఆవిడ సిగ్గువిడిచి వచ్చి నిన్ను స్వయంగా తనచేతులతో పరిష్వంగం చేసుకొనవలెనని అభిలషిస్తున్నావా ? ఓ కామశీలీ, ఏ కోపశీల చీకటి తప్పు చేసినందుకై నీపై కోపపడినది ? పాదాల కెఱగినా నిన్నెవతె తిరస్కరించినది ? ఆమె తన సేతకు పశ్చాత్తాపపడి చివురు పాన్పునే శరణుజొచ్చేలా చేస్తాను – చెప్పవయ్యా ప్రభూ ! అనుగ్రహించు.

నీ వజ్రాయుధం విశ్రమించనీ. నా శరపరంపరతోనే ఏ దైత్యునైనా సరే భుజబలవిరహితునిగా చేసివేస్తాను. పెద వులు వణకుతుండగా ఏ కోమలి కోపపడినా గడగడలాడి పోయేలా వానిని చేస్తాను – చెప్పు.

నాకున్నది పుష్పాయుధమే అయినా మీ అనుగ్రహం వల్ల, ఒక్క వసంతుని సాయంతోనే పినాకపాణి అయిన హరుని గుండెడిటవునైనా నీరుగారిపోజేయగలను ప్రభూ. ఇతర ధానుష్కులు నాకు లెక్కేమిటి ? ”

ఆ మాటలను దేవప్రభువు విన్నాడు. మెల్లగా తన తొడపై పెట్టుకొని ఉండిన కాలినితీసి పాదపీఠంపై ఉంచినాడు.

తానుకోరిన పని తానుగానే చేయఃగలనని చెప్పిన కామునితో ఆఖండలు డిలా అన్నాడు:

"నీవు చెప్పినంతా చేయఃగల సమర్థుడవయ్యా మిత్రమా! నాకున్న ఆయుధాలు రెండు — ఒకటి వజ్రాయుధం, రెండు నీవు. వజ్రాయుధమేమో తపోవీర్యసంపన్నులయెడ పని చేయదు. మరి నీవలా కాదు— సర్వతోగామివి నీవు; దేనినైనా సాధింపగలవాడవు కూడా.

నీ సామర్థ్యం, శక్తి నేనెఱుగుదును. అందువల్లనే ఒక మహాకార్యంలో నన్నువలెనే నిన్ను నియోగిస్తున్నాను. భూమి నంతటిని మోయఃగలదని చూచేకదా ఆదిశేషుని శ్రీమన్నారాయణుడు తన్ను మోయుటకు నియోగించుకున్నాడు.

శివునైనా ధైర్యచ్యుతుని చేయఃగలనని ఇంతకుముందే నీవన్నావు. ఆ మాటలతోనే మాపనిని దాదాపు నీ:ంగీకరించినట్లే అయినది. ప్రబల విరోధులుగల దేవతలు ప్రస్తుతం కోరుతున్నదికూడా అదేనయ్యా. ఆ భవవీర్యప్రభవుడైన వానినే తమ సేనానిగా చేసుకొనవలెనని మాదేవతల కోరిక. ఆ శంకరుడు కృతవిధియై బ్రహ్మయందు తన చిత్తం నిల్పి నేడు తపస్సు చేస్తున్నాడు. ఆయఃనను నీ బాణమొక్కటే దారికి తేగలదు.

పవిత్రురాలైన పార్వతిపై ఆయన మనసు వడునట్లుగా నీవు ప్రయత్నించాలి. ఆయన వీర్య నిషేక భూమిగా గలది స్త్రీలలోకెల్ల ఆమె ఒక్కతేనని బ్రహ్మదేవుడు మాకు సెలవిచ్చి ఉన్నాడు.

తన తండ్రి ఆనతి మేఱకు కాము హిమవంతంపై తపస్సు చేసుకుంటున్న శివుని సేవిస్తున్నదని అచ్చరలు చెప్పగా విన్నాము. వారు మాచారులని నీకు తెలుసుగదా! మరి ఈవిధంగా ఆకార్యం కాగలదిగానే ఉన్నది. అయినా సస్యం మొలకెత్త డానికి ముందు కాస్త వాన కురవాలిగదా. అలాగే నీవువెళ్ళి ఆపని నెఱవేరుటకు కావలసిన వాతావరణం కల్పించు. నీ కార్యం సిద్ధిస్తుంది. దేవకార్యాన్ని నెఱవేర్చేసంగతి చూడు ఇలా దేవవిజయం కోసం శివునిపై అమ్ము విడువగల ధన్యత నీకే దక్కుతోంది. అప్రసిద్ధమైనా అసాధారణమై పని పురుషు నికి యశస్సు చేకూరుస్తుంది. మరి ప్రసిద్ధము, అసామాన్యము కూడా అయిన ఈపని నీకు చిరకీర్తిని సంపాదించిపెట్టగలదు.

నిన్నీపని చేయుమని అర్థిస్తున్నవారు దేవతలు; ఈపని చూతమా ముల్లోకాలకూ అవసరమైనది. నీవు అమ్ము పట్టినా చేయవలసినపని హింసాకరమూ కాదు. మరి నీవా అద్భుత పరాక్రమ ధుర్యుడవు- ధన్యుడవు కదా మిత్రమా! నిన్నెప్పుడూ వదలక వెన్నంటే వసంతుఁ డెలాగూ చెప్పకున్నా నీకు సాయంగా ఉంటాడు. అగ్నిని ప్రజ్వలింపజేయుమని గాలి నెవరైనా అడుగుతుంటే అలా చేస్తున్నాడా ?"

అని ఈ విధంగా ఇంద్రుడు చెప్పగా వల్లెయని మన్మ థుడు ప్రభువు ఆజ్ఞను అనుగ్రహదత్తమాలికనువలె శిరసావ హించినాడు. ఐరావతాన్ని ఆస్ఫాలనం చేసి చేసి రాటుదేరిన తన చేతితో ఇంద్రుడు వాని ఒడలు నిమిరినాడు. సరే మన్మ థుడు బయలుదేరినాడు.

తన కిష్టుడైన సహచరుడు వసంతుడు వెంటరాగా, భీతు భీతుగా రతి అనుసరింపగా, తన ఆత్మబలితోనైనాసరే దేవేంద్రుడు కోరిన పనిని నిర్వర్తింప నెంచినవాడై కాముడు హిమవంతంలోని శివుని ఆశ్రమానికి వెళ్లినాడు.

## వసంత విజృంభణం

అంతట నిగ్రహశీలురైన మునుల తపస్సమాధికి ప్రతి కూలమైన రీతిగా మనోభవుని అభిమానభూతుడైన వసంతుడు ఆ తపోవనంలో తన స్వస్వరూపంతో విజృంభించినాడు.

సూర్యుడు సమయ విలంఘనంచేసి కుబేర దిశవేపు పోనుండగా, దక్షిణదిశ నిట్టూర్పు విడుస్తున్నట్లు మందమలయా నిలం బయలువెడలినది.

అంతట అశోకం మొదటినుండే చివుళ్లను వేసినది; పూలను పూసినది. అందెలు మ్రోయుచుండగా సుందరులు పాదతాడనంతో దోహదక్రియ నడపవలసిన అవసరంకూడా లేకపోయినది

చివురుటాకులే ప్రక్కనకట్టిన పత్రాలు కాగా, నవ చూతబాణం మన్మథునకు సిద్ధంచేసి యిచ్చిన వసంతుడు, తుమ్మెదలను దానిపై మన్మథ నామాక్షరాలనువలె నివిష్టం చేసినాడు.

కొండగోగు లప్పుడు పూచినవి. ఆ పూలు చూచుట కెంతో అందంగా రంగురంగులతోనున్నా వాసనలేని పూలగు

టతో మనస్సు చివుక్కుమన్నది. అయినా సృష్టికర్త అన్ని గుణాలనూ ఒకచోచేర్చి సమగ్రం చేయడాని కెప్పుడూ విముఖుడే గదా !

విచ్చని మోదుగుపూలు అరుణారుణాలై చంద్రవంకల వలె నుంటున్నవి. అందువల్లనే వనలక్ష్మీసమాగతుడైన వసంతుని తడి నఖక్షతాలలా ఉన్నవవి.

వసంతలక్ష్మి వనలక్ష్మి ముఖంపై తుమ్మెదకాటుక కలిపిన చిత్రతిలకాన్ని రచించినది. బాలారుణకోమలమైన రాగంతో చూతపల్లవాధరాన్ని అలంకరించినది.

ప్రేంకణం పూగుత్తులలోని పుప్పొడిరాలి జింకల కళ్లలోపడి చూపు తగ్గించినది. అవి మదోద్ధతములై గాలి కెదురుగా ఎగురుతూ పోతున్నవి. పండుటాకులు గరగర లాడుతూ ఆ వనాలలో రాలుతున్నవి.

మధువికసనంతో మావిచిగుళ్ళను తిని రక్తకంఠమై పుంస్కోకిల మధురంగా కుహూరవం చేసింది. పొలయలుక చెందిన వెలదుల కోపాన్ని కూల్చదోసే ఆ కూతే మన్మథుని వచనంగా భాసిల్లినది.

మంచు విరిసి పోతున్నది. అందువల్లనే కిన్నరుల పెదవులు పగిలిపోక చక్కగా నున్నవి. అంతేకాక చలిలో వానికి కుంకుమాదులు పూసేవారు. ఇప్పుడా పూతలులేక అవి పాండురవర్ణసంశోభితా లయినవి. మరి ఇలా చలి విడిపోగా వారి మకరికాపత్రాలపై చిఱుచెమట లుదయించసాగినవికూడా.

అలా అకాలంలో వసంతం రావడం చూచి శివతపో వనంలోని తపస్వులు, మనసు పెట్టి చిత్తవికారాలను నిరోధించుకొని తమ మనసును నిగ్రహించుకొగలిగినారు. తన పూలవిల్లు నెక్కిడి రతిద్వితీయుడై మదను డక్కడికి వచ్చెను కదా! అందుతో స్థావరజంగము మిథునములన్నీ తమ అనురాగం పరాకాష్ఠనందగా తదనుకూల చేష్టలతో ప్రవర్తించినవి.

తుమ్మెద పుష్ప మధుపాత్రలో తన ప్రియురాలితోపాటు కలిసి తేనె త్రావినది. అరమోడ్పు కనులతోనున్న జింకను దుప్పి కొమ్ముతో గోకసాగినది. ఆడు ఏనుగు ప్రేముడితో తామరపుప్పొడి వాసనగల గండూషజలాన్ని గజమున కొసగినది. చక్రవాకం తన పెంటికి తాను సగం తిన్న తామర తూడు నిచ్చి పెెమ చూపినది.

కిన్నరాంగనలు పుష్పాసవం త్రాగుతూ కనులలో మత్తు తొంగిచూడగా పాటలు పాడుతున్నారు. చిరుచెమటలతో వారి ముఖాలపైనున్న మకరికాపత్రరచనలు కొద్ది కొద్దిగా చెడిపోతున్నవి. ఆ పాటల నడుమ నడుమ కిన్నరులు వారిని ముద్దిడుకొంటున్నారు.

ఇంతింత పుష్పస్తబకస్తనాలతో, మనోహర ప్రవాళోష్ఠములతో లతాంగనలను తరువులు వినమితశాఖాబాహువులతో కౌగిలించుకొన్నవి.

ఈ ఆమని వగలుపోతున్నా, అచ్చరలు పాటలు పాడుతున్నా హరు డా సమయంలో ఆత్మానుసంధానపరుడే అయి

నాడు. మనోనిగ్రహం గలవారికి ఎలాంటి విఘ్నాలైనా వారి సమాధిని భంగం చేయగలవి కాలేవు గదా!

అంతలో నంది పొదరింటిద్వారం వద్దకు వచ్చినాడు. అతని ఎడమ ముంజేతిపై బంగారుబెత్తం వ్రేలుతున్నది. ఈ వసంత విలాసం చూచి తన కుడిచేతి చూపుడువ్రేలును పెదవులపై నుంచుకొని 'జాగ్రత్త, చిత్తవికారం పొందకు'డని గణాలను సన్నతోనే ఆజ్ఞాపించినాడు.

ఆ శాసనంతో వెంటనే కాననం కాననమే చిత్తరువు లోని బొమ్మవలె అలా నిలిచిపోయినది. చెట్లు కదలాడ లేదు; తుమ్మెదలు తిరుగాడ లేదు; పక్షులు కలకలారావం చేయడం లేదు; మృగము లెగురుట లేదు.

ఆ నందిచూపులను తప్పించుకొన్నాడు మదనుడు. ప్రయాణంలో చుక్కెదురును పరిహరించుకొన్నట్లు దాని తప్పించుకొన్న తర్వాత సురపొన్నలు అల్లిబిల్లిగా అల్లుకొని ఉన్న భూతపతి ధ్యానస్థానాన్ని చేరుకున్నాడు.

మృత్యువు దగ్గరపడుతున్నా మారుడు శివుని కను గొన్నాడు. దేవదారుద్రుమంక్రింది అరుగుపై పులిచర్మం పరుచుకొని కూర్చున్నాడా ముక్కంటి. ఆయన వీరాసనం వేసి కూర్చున్నాడు. పూర్వ కాయం స్థిరంగా ఉన్నది. నిటారుగా నున్న వీపు; ఉభయ భుజ శిరస్సులూ కాస్త వొంగినవి. తొడ లపై రెండు చేతులను వెల్లకిల ఉంచుకొన్నాడు. అవి విరిసిన తామరపూలవలె తోచినవి.

ఆయన తనజడలను పాములతో కట్టుకొన్నాడు. రెండు పేటలుగా జపమాలను చెవికి చుట్టుకున్నాడు. తన గొంతుక నల్లదనంతో మరింత నల్లనైన కృష్ణమృగ చర్మాన్ని కట్టుకున్నాడు.

ఆయన కనీనికలు కొద్దిగా మిసమిసలాడుతూ తీవ్రంగా స్థిమితంగా నున్నవి. ఆయన కనుబొమ్మ లేమాత్రం కదలుట లేదు. రెప్ప లల్లాడుటలేదు. క్రిందుగా కనులనుండి వెలుగులను చిమ్ముతూ ముక్కుకొననే చూస్తున్నా డాయన.

ప్రాణాన్ని నిరోధించి వానకురవని మబ్బువలెను, అలలు లేని మడుగువలెను, గాలికి కదలాడని దీపంవలెను ఆయన నిశ్చలుడై ఉన్నాడు. కపాలనేత్రంనుండి దారిచేసుకొని బ్రహ్మరంధ్రంనుండి జ్యోతిః ప్రరోహాలు పొడసూపుతున్నవి. తామరతూళ్ళ దారాలకంటె కోమలమైన బాలచంద్రుని వెలుగు మొలకలు వాడిపో జేస్తున్నవి.

నవద్వారములనుండి నివృత్తంచేసి మనసు నాయన హృదయంలో నిలిపి సమాధిగతుడై ఉన్నాడు. బ్రహ్మవేత్తలు అక్షరుడనిపిలిచే ఆత్మను ఆత్మయందే విలోకిస్తున్నాడా శివుడు.

ఆ ముక్కంటికి అలా మనసుతో కూడా చేరుకొన వీలు లేనట్టివానిని మరుడు దగ్గరగానిల్చి చూచినాడు. భయభ్రాంతుడై తన చేతులోనుండి శరచాపాలు జారిపోవడం కూడా అతను గమనించలేదు.

ఇలా ఉడిగిపోతున్న కాముని బలాన్ని పెంపొందిస్తున్న దేహసౌందర్యంతో అంతలోనే హిమగిరి కన్య అక్కడికి వచ్చినది. ఆమెవెంట చెలికత్తెలు కూడా వస్తున్నారు.

ఆమె ఆసమయంలో వసంత కుసుమాలనే పూర్తిగా నగలుగా ధరించినది. కెంపుల నగలకు బదులు అంతకంటె అరుణమైన అశోకపుష్పాలను ధరించినది; బంగారు పోంగు నడచే కొండగోగుపూలను, ముత్యాల నతకరించే వావిలి పూలను రకరకాల మురువులుగా పార్వతి కైసేసికొన్నది. కుచభారంతో ఆమె కాస్త వంగినట్టున్నది. బాలారుణశోమల మైన వలువ కట్టుకొన్నది. అందుతో నిండు పూగుత్తులతో వంగి చివురించిన నడతీవెవలె నున్న దామె.

ఆమె మొలనూలుగా పొగడపూలదండను కట్టుకున్నది. అది జారిపోతుండగా చేతితో మాటిమాటికి పైకెగద్రోసు కుంటున్నది. తన వింట రెండవ అస్త్రాదును చక్కనితావని యెఱిగి మన్మథు డక్కడ దాచెనేమో అన్నట్టున్న దా మొల నూలు.

తన నిట్టూర్పు తావులమీది ఆసతో ఎగబడుతూ కెంపెదవిని సమీపిస్తున్న తుమ్మెద నామె బిత్తఱి చూపులతో మాటిమాటికి తనచేతి లీలాకమలంతో తరుముతున్నది.

సమస్తాంగ సమగ్ర సౌందర్యంతో రతినిగూడా సిగ్గువడ జేస్తున్న ఆపార్వతీదేవిని మన్మథుడు చూచినాడు. చూడగనే జితేంద్రియుడైన శివుని తాను మరులుగొల్పగలనన్న ఆశ తిరిగీ అతనిలో గట్టిపడినది. తనపని నెఱవేరితీరునని నమ్మకం కలిగినది.

తన భావిభర్తఅయిన శంభుని తపోభూమి ప్రాంగణం లోనికామె ప్రవేశించినది. ఆ శివుడును తన అంతరంలో పరమాత్మయగు పరంజ్యోతి సందర్శనం చేసుకొని యోగనిష్ఠను చాలించినాడు. మెల్లగా ఊపిరి విడువ సాగినాడు. స్థిరమైన తన వీరాసనాన్ని సడలించినాడు. ఈ పనులతో భూమిని మోస్తున్న ఆదిశేషువు క్రుంగి ఎలాగో భూమి నలాగే మోయగలిగినాడు.

అంతట నందీశ్వరుడు శివునివద్దకువచ్చి నమస్కరించి శుశ్రూషార్థం గిరికన్య విచ్చేసెనని విన్నవించినాడు. సరే ప్రవేశపెట్టు మన్నట్టు బొమకదలికతోనే స్వామి సూచింపగా ఆమెను లోని కంపినాడు.

పార్వతి చెలికత్తెలు స్వయంగా కోసుకొని వచ్చిన చివుళ్ళనూ, వసంతకాలీన కుసుమములనూ నమస్కార పూర్వకంగా శివుని పాదసన్నిధిలో చల్లినారు. పార్వతికూడా ఆయనకు తలవంచి నమస్కరించినది. అపుడామె నీలాలకము లలోని నవకర్ణికారకుసుమం జారినది. చెవినుంచుకున్న పల్లవం వాలిపోయినది.

"ఇతర స్త్రీలకు అలభ్యుడైనపతి నీకు లభించుగాక" అని భవు డామె నాశీర్వదించినాడు. అది నిజమే అయినది. ఈశ్వరుడు వచించినమాటలు లోకంలో వ్యతిరేకం కావడ మెన్నడైనా సంభవమా!

అదే తన బాణం వేయుట కదనని మదనుడు భావించి నాడు. నిప్పులోని కురుకుతున్న మిడతవలె పార్వతీ సన్నిధానంలో శివునిమీదనే గుఱిపెట్టి వింటినారిని కదలించినాడు.

తపస్విసత్తముడైన గిరీశునిముందు గౌరి తన అరుణ కరాబ్జంతో ఆకాశగంగలోని తామరవిత్తు లెండించి కూర్చి తెచ్చిన జపమాల నుంచినది. భక్తసులభుడైన ఆయన ఆ మాలను ప్రతిగ్రహించ నుంకించినాడు. పుష్పబాణుడున్నూ తన అమోఘమైన సమ్మోహనాస్త్రాన్ని వింట సంధించినాడు.

హరునకు కాస్త గుండెదిటవు తప్పినది. చంద్రోదయంలో సముద్రంవలె మనసు పొంగినది. బింబఫలాధరమైన ఉమాదేవీ ముఖంపై తన చూపుల నాయన ప్రసరింపజేసినాడు.

ఒడలంతా గగుర్పొడువగా కనులువాల్చుకొని ముఖం కాస్త అటుత్రిప్పి పార్వతి కూడా తన మనోజనితరక్తిని తన అవయవాలతో వెలువరిస్తూ నిలుచున్నది.

అలా తటాలున తన ఇంద్రియాలు వశంతప్పడం గమనించిన త్రినేత్రుడు వశిగనుక బలవంతంగా నిగ్రహించుకున్నాడు. తన మనసలా చెదరడానికి కారణమేమా అని నలుగెలకులా పరికించి చూచినాడు.

తన వింటిని చక్రంవలె వంచి నారిని పట్టుకున్న తన చేతి పిడికిలి తన కుడికంటి చెంతనుండగా భుజాలువంచి, కాస్త ఎడమపాదం వంచి, తనమీదికి అమ్ము విడుచుటకు సిద్ధంగా నున్న మనోజు డా శివునకు కానవచ్చినాడు.

తపోనిష్ఠుడు గనుక మహాకోపంతో బొమముడిపెట్టినముఖం దుర్నిరీక్షంకాగా శివు డలా చూచెనా? చూడగనే ఆయన మూడవ కంటినుండి మంటలు క్రక్కుతూ అగ్ని బయల్వెడలినది. గగనంలో దేవతలుచేరి"ప్రభో క్రోధం ఉపసంహరించుకో, ఉపసంహరించుకో," అని ఆక్రోశిస్తుండగనే ఆ శివుని మూడవ కంట పొడమిన అగ్ని మదనుని భస్మసాత్కృతుని చేసివేసినది.

అత్యంత దుఃఖాతిరేకంతో రతీదేవి మూర్ఛిల్లినది. ఆమె ఇంద్రియవ్యాపారం స్తంభించి పోయినది. అలా తన మగడుపోయిన దిగులునకు ఆ కాసేపు దూరమైన దామె. మదనుని భార్య కలా ఆ మూర్ఛ కొంతమేలే చేకూర్చినది.

వజ్రం వనస్పతిని భంజించినట్లుగా తన తపస్సుకు కలిగిన ఆ విఘ్నాన్నలా విచ్ఛిన్నపఱచి రుద్రుడు స్త్రీ సన్నిధానంనుండి తప్పుకొనదలచి తన గణాలతోపాటు అంతర్ధానం చెందినాడు.

తన ఉన్నతోన్నతుడైన తండ్రికోరికా, తన శరీర సౌందర్యం వ్యర్థమయ్యెనని శైలజ తలపోసుకున్నది. అందులో ఈ సంఘటన తన చెలులముందే జరిగినదికదా అని చాలా సిగ్గుపడిపోయినది. శూన్యచిత్తయై ఎలాగో తన యింటిముఖం పట్టినది.

రుద్రసంరంభ భయంతో కనులుమూసుకొని దయనీయ స్థితిలోనున్న తన కూతును హిమవంతుడు రెండు చేతులతో ఎత్తుకున్నాడు. కొమ్ములకు తామరతీవె తగుల్కొన్న సురగజం వలె వేగంతో తనశరీరం దీర్ఘాకృతం కాగా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ దారిపట్టినాడు.

ఇది తృతీయసర్గ.

# చతుర్థ సర్గ

ఈవిధంగా సతి అయిన ఆ రతీదేవి మూర్ఛిల్లి నిశ్చేష్టురాలై కాసేపున్నది. ఆ తరువాత దుర్భర నవవైధవ్య వేదనను అనుభవించుటకేమో ఆమెను విధి మేల్కొల్పినాడు. మెల్లగా కనులు తెఱచినది. వానిలో చైతన్యం కానవచ్చినది. పూర్వం తనవాని నెంతగా చూచినా తనివినొందని ఆ కనుల కాత డిక కనబడడన్న సంగతి తెలియదు.

"ప్రాణేశ్వరా! బ్రతికియున్నావా?" అంటూ ఆమె లేచి కూర్చున్నది. చూడగా ఆమెకు ముందున్న నేలపై పురుషాకృతిలోనున్న హరుని క్రోధాగ్నితో ఏర్పడిన బూదిమాత్రమే కానవచ్చినది. ఆ భస్మం చూడగనే ఆమె తిరిగి విహ్వాల అయిపోయినది. నేలపై పడి దొర్లినది. ఆమె ఉరస్థలం ధూళి ధూసరితమైనది. శిగముడి ఊడిపోయినది. తనలాగే ఆ వన స్థలినీ దుఃఖాక్రాంతను చేసివేస్తున్నట్లు రతి విలపింప సాగినది.

"విలాస పురుషులందరకు సౌందర్య సంశోభితమై ఉపమాన ప్రాయమైన ఈ నీ శరీరానికి ఇలాంటి గతి పట్టినదే. ఇదిచూచీ నాగుండెలు పగిలిపోవడంలేదు. స్త్రీలెంత కఠినలో కదా! నా జీవితం నీకే అధీనంకదా! మరి ఒక్క క్షణంలో ఆ మైత్రి నంతటిని పోద్రోసి నన్నిలా ఇక్కడ పడవేసి ఎక్కడికి పారిపోయితివి? కట్ట తెగగొట్టగానే జలప్రవాహం తన

లోని తామరతీగె నలా ప్రక్కకు త్రోచివైచి దూసుకొని పోయినట్టు వెళ్ళిపోతివే? ఎక్కడకు పోతివయ్యా!

నీవు నాకేమీ అప్రియం చేయలేదు. నేనూ నీకు వ్యతిరేకంగా నడవలేదు. మరి నిష్కారణంగా ఏడుస్తున్నా నాకు దరిశన మీ వెందుకు? ఒకవేళ ఎప్పుడో నే నేదో తప్పు పేర పిల్చితివని నిన్ను మొలనూలితో కట్టివేసితినే అదేమైనా జ్ఞాపకం వచ్చి ఇలా ప్రతిక్రియ చేయనెంచితివా? చెవిపూవుతో కొట్టగా అందలి కేసరాలురాలి నీకంటిని కలచివేసిన సంగతి మనసుకు వచ్చి ఇలా చేశావా?

"నా హృదయంలో ఉన్నావు సుమా" అని నాతో అంటూ ఉంటే, అది కేవలం వట్టిదేనా? అలా మాటవరుసకే అన్నావేమో. కాకపోతే నీ శరీర మిలా బుగ్గి అయిపోయినా నే నిలా చెక్కుచెదరకుండా ఉన్నానెందుచేత? పరలోకం వెళ్ళిన నిన్నిప్పుడే నేనూ వెంబడించగలను. కాని, మరి ఈ జనమంతా ఏమవుతారు? వారి సుఖసౌభాగ్యమంతా నీ అధీనమైనదే కదా?

రేజీకటి కనుల కప్పగా రాజమార్గానబడి పోతూ, ఉరుములతో గుండెలదరిపోయిన కాంతలను కాముకుల ఆవాసాలకు చేర్చగల వాడెవ్వరయ్యా ఇక?

కనులెఱ్ఱబడగా త్రిప్పుతూ, మాటలు తడబడుతుండగా మధువు త్రావిన ప్రమదలకు నీవే లేకపోతే ఆ కైపంతా ఎందుకయ్యా స్వామీ!

నీవు పోతివని తెలియగనే నీకు ప్రియస్నేహితుడైన చంద్రుడు తా నుదయించడ మిక ఎందుకనుకున్నాడు. బహుళ పక్షం గతించినా తన కృశత్వాన్ని అతికష్టంతో విడిచిపెడు తున్నాడు.

పసుపూ ఎరుపూ రంగులతో అందంగా ఉన్న బంధనం కలదై, కోయిలకలస్వనంతో సూచితమైన క్రొమ్మామిమొగ్గ ఇప్పు డెవరికి బాణం కాగలదయ్యా ?

నీ వెన్నిమారులో నీ ధనుస్సునకు అల్లెత్రాడుగా ఈ తుమ్మెదల బారును వినియోగించుకున్నావు. అవి పాపం అతి దుఃఖితురాలైన నాతోపాటు రోదిస్తున్నట్లుగా రొదచేస్తున్నవి. తిరిగీ నీవు నీ మనోహరాకారంతో లేచిరా ! మధురాలాప కోవిద అయిన కోకిలను, రతిదూతికాపదంలో తిరిగీ ఆదేశించు. ఎన్నిమారులు నీవు నాకు తలవంచి ప్రార్థించినావో! ఎన్ని మారులు వణకిపోతూ నన్ను కౌగిలించుకున్నావో! ఎన్నిసారులు మనం రహస్య క్రీడలలో తేలితిమో ! అన్నీ తలచుకుంటే నాకు మనశ్శాంతి చిక్కకున్నది ప్రభూ.

ఓ రతిపండితా, నీవు వసంతర్తు కుసుమసంచయంతో నాకు చేసిన అలంకారమంతా అలాగే ఉన్నది. కాని దీనిని రచించిన నీ శరీరం కానరాకుండా పోయిందే ఇదేమిటి ? నన్నా పాడు దేవతలు పిలుచునప్పటికి అలంకరిస్తూంటివి. నా పాదాలకు పారాణి పెట్టడం పూర్తికాకనే వెళ్ళావు. ఇదిగో ఈ ఎడమ కాలికి పారాణి పూర్తిచేసి పోదువుగాని రావయ్యా ప్రియతమా!

ఔను నీవు వెళ్ళగనే ఆ స్వర్గంలోని అచ్చరలు నిన్ను ప్రలోభ పెడతారేమో - వారు నెరజాణలు మరి! వారా పని

చేయకముందే ఇదిగో నేను అగ్నిలోదుమికి నీ ఒడిలో వచ్చి వాలుతా నుండు. అయినా అలా నిన్ననుసరించి వస్తానే అనుకో. అయినా మన్మథుడు లేకుండా రతి ఒక్క క్షణమైనా బ్రదికి ఉండెనన్న అపవాదంమాత్రం నాయెడ అలా నిలిచే పోతుంది సుమా !

కనీసం నీ శవానికైనా తుదిసారి అలంకారం చేతా మంటే అందుకుకూడా వీలులేదే! నీ ప్రాణమూ, శరీరమూ కూడా ఒక్కమారే మంటగలిసిపోయెనే! ఏం చేతును ?

అయ్యో! ఇప్పుడున్నట్టున్నదే! నీవు ఒడిలో విల్లు నుంచుకొని బాణాన్ని సరిజేసుకుంటూ, వసంతునితో నవ్వుతూ మాటాడుతూ వాలుచూపులతో నన్ను చూస్తివే! అప్పుడే ఏమయిపోతివి ?

అపుడు అన్నట్టు నీకు పూలవిల్లును సంసిద్ధపరచి ఇచ్చే నీ అనుగు చెలికాడు ఆ వసంతు డేడీ! క్రోధోదగ్రుడైన ఆ పినాకపాణి నీకు పట్టించిన గతినే అతనికి పట్టించలేదు కదా!"

అలా ఆ రతి విలాపాలతో విషదిగ్ధ శరాలతో గుచ్చి నట్లుకాగా వసంతుడు ఆపన్నురాలైన ఆ రతీదేవి నోదార్చ టకై ఆమె ముందు సాక్షాత్కరించినాడు. వానిని చూడగనే ఆమె మరింత రోదించినది. రొమ్ము కొట్టుకున్నది. తమకు కావలసినవారిముందు దుఃఖం కట్టదెగకొట్టుకొని ప్రవహించ డం సహజంకదా మరి !

"ఓ వసంతా ! నీ చెలికానిలో ఏమి మిగిలినదో చూడ వయ్యా - ఈ పావురరంగు బూడిదేనయ్యా మిగిలినది. అది

కూడా గాలికలా అంతటా చెల్లాచెదరై పడిపోతున్నది. చూచావా?" అని అతనితోనని తిరిగీ ఆమె పరిపరి విధాలా విలపించినది.

"మదనా నీ స్నేహితుడు వసంతుడు నీపై ఉత్కంఠతో నున్నాడు. ఆయనకైనా కనిపించిపో. భార్యలమీది ప్రేమ చంచలం కావచ్చు. కాని పురుషులకు నేస్తుల మీది ప్రేమ అచంచలం కదా! ఆతనికైనా కనపడవా మరి? ఇదో నీ ప్రక్కనే నిలుచుండి తామరతూటిలాంటి పూలబాణాలతో నున్న నీ ధనుస్సుకు దేవ దానవ మానవ లోకాలన్నిటినీ వశవర్తులనుగా చేయిస్తూవచ్చనే అతడేనయ్యా ఈ వసంతుడు-" అని తిరిగీ వసంతునితో ఆమె అంటున్నది.

"వసంతా! ఆరిపోయిన దీపంలా నీ మిత్రుడు పోనే పోయెనయ్యా. ఇక తిరిగిరాడు. ఈ దుర్భర దుఃఖభారంతో ఆరినవత్తిలా ఉన్న నా దురవస్థచూడు నాయనా! అయినా కాముని హత్యచేసిన ఆ శివుడు తన హత్యావిధిని సగమేచేసి వదలె నేమి? నన్ను చంపక వదలినాడేమి? అయినా ఆశ్రయ ద్రుమాన్ని గజం పెల్లగిస్తే చాలుకదా! దాని నాశ్రయించే అనపాయంగా ఉండిపోయిన తీవె ఎలాగో పడిపోవును కదా! అందుకనే ఇలా ఆ విధి చేసెనేమో!

ఇక నీవు చేయవలసిం దొక్కటేనయ్యా. ఈ ఒక్క సాయం నీవు నాకోసం చేయకతప్పదు. ఈ విధురురాలికి అగ్ని దానంచేసి పతి అంతికానికి నీవే పంపించాలి. అదొక్కటే నీవు చేయవలసిన పని. చంద్రునితోపాటు వెన్నెల పోతుంది.

మబ్బుతో పాటే మెఱపు మాయమవుతుంది. ఆడవారంతా అంతేనాయనా! వారు పతి ననుసరించే ఉంటారు. ఇది అచేతనాలుకూడా పాటిస్తున్న ధర్మం.

ఇదిగో ఈ శోభస్కరమైన ప్రియగాత్ర భస్మంతో నా ఉరము నలదుకొని చివురుటాకుల సెజ్జపై పడుకున్నట్టుగా చితిపై ఈ శరీరాన్ని చేరుస్తాను. నీ వెన్నిమారులో మా యిద్దరకు పూలపానుపు సవదరించుకొనడంలో సాయపడినావు. సౌమ్యుడా, ఇదో ఇప్పుడు నమస్కరించి అడుక్కుంటున్నాను. త్వరగా నాకు చితి తయారుచేసి యివ్వు. ఆ చితిపై నే నెక్కగనే అగ్నినిడి మలయమారుతవీజనాలతో ఆ నిప్పును మంట సేయుము. మదనుడు నన్నువీడి ఒక్క క్షణమైనా ఉండలేడన్న సంగతి నీకు తెలియదా? ఆ తర్వాత మా యిద్దరికీ కలిపి ఒకే జలాంజలితో తర్పణం చెయ్యి. అక్కడ ఆ లోకంలో నాతో కలిసే ఆయన ఆ నీరు త్రాగుతాడు లేవయ్యా-

అలాగే నీ ప్రియమిత్రునికి మామిడి పూలంటే ఇష్టం కదా! అందుకని మావి చివుళ్లను, మావి పూగుత్తులను ఆ తర్పణజలంతో కలిపి విడువవయ్యా!"

అని అంటూ ఇలా దేహత్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్న రతీదేవి నోదారుస్తూ ఒక ఆకాశవాణి వినవచ్చినది. చెరు వెండి అల్లాడుతున్న చేపను తొలకరి చినుకులవలె ఆమె కా మాటలు ఊరట గూర్చినవి.

"ఓ రతీదేవీ, త్వరలోనే నీకు నీభర్త లభిస్తాడు. ఆ హరలోచనాగ్నిలో మిడుతవలెపడి మాడిపోవడాని కొక కారణం ఉంది. విను. కామ ప్రేరణతో పూర్వం ఇంద్రియవశుడై

ప్రజాపతి తన కూతుపైనే మనసుపడినాడు. ఆ మనోవికృతి నాయన ఎలాగో నిగ్రహించుకొని అప్పుడే నీ భర్తను శపించినాడు. ఆ శాపఫలాన్నే అతని నిప్పు డనుభవించినాడు.

"పార్వతీదేవి తపస్సుచేసి ఈశ్వరుని తనకు అభిముఖునిగా చేసుకుంటుంది. శివుడామెను పరిణయమాడి ఆ ఆనంద సమయంలో నీ మగనికి తిరిగీ శరీరాన్ని ప్రసాదిస్తాడు—అని పూర్వం ఆ బ్రహ్మ తన శాపావధిని ధర్మాన కెజెగించినాడు. నిజమే, అంత కోపంవచ్చినా అనుగ్రహంకూడా కలవాడాయన. జితేంద్రియులు మేఘములవంటివారు సుమా! అంబుదము లెలా పిడుగులకూ, అలాగే శీతల జలాలకూ మూలములో అలాగే వారునూ అశనిపాతానికీ అమృతానికీ కూడా ఆదికారణాలమ్మా! కాబట్టి త్వరలో నీ మగనిని కలుసుకోనడం కోసం ఈ నీ శరీరాన్ని పరిరక్షించుకో. ఓ కల్యాణీ, సూర్యుడు నదిలోనినీరును పూర్తిగా పీల్చివేసినా, వానకాలం రాగానే తిరిగీ నీటితో దానిని నింపనే నింపుతాడమ్మా."

అని ఏదో అదృశ్యరూపం మరణింపవలెనని కృతనిశ్చయురాలైన రతీదేవిని ఉద్బోధించి ఆ ప్రయత్నాన్ని విరమింపజేసినది. ఆ ఆకాశవాణిమీది విశ్వాసంతో వసంతుడామెను ఎన్నో విధాలుగా చెప్పి ఊరడించినాడు.

అప్పటినుండి పగటి ఎండలోని నెలవంక వెలుగు దక్క సాయంతనంకోసం ఎలా ఎదురుచూస్తుందో అదే విధంగా ఆ రతీదేవి తన ఆపదలు గట్టెక్కే దినంకోసం వ్యసన కృశయై నిరీక్షింపసాగినది.

ఇది చతుర్థసర్గ

## పంచమ సర్గ

మరి అక్కడ పార్వతి తన కళ్లెదుటనే పినాకి మనోభవుని దహించివెయ్యడం చూచి విఫలమనోరథు రాలైనది. మనసులో తన సౌందర్యాన్ని తానే నిందించుకున్నది. సౌందర్య ప్రయోజనం ప్రియజన సాహచర్య సంధాయకత్వమే కదా! అందుకు కానప్పుడా సొగసెందుకు? అందువల్లనే ఎట్లైనాసరే ఏకాగ్ర చిత్తంతో తపస్సుచేసి తన సౌందర్యాన్ని సఫలం చేసుకోనవలెనని పార్వతి తలంచినది. మరి అలా కాకపోతే అలాంటిభర్త, అలాంటివాని ప్రేమా ఊరకే ఎలా లభిస్తుంది?

ఇలా పరమేశ్వరునిపై మక్కువపడి తమ కూతురు తపస్సు చేసుకోనాలని ప్రయత్నిస్తున్నట్లు మేనకకు తెలిసింది. ఆమె పార్వతిని ఎదకదుముకొని ఈ మహత్తరమైన మునివృత్తిని మానుకొమ్మని ఆటంకపరచినది.

"మన ఇంటిలో కోరినదేవతలు లేరా తల్లీ! తపస్సెక్కడ? నీ ఈ కోమల శరీరమెక్కడ? అతి లలితమైన దిరిసెన పూవు తుమ్మెద వాలితే నిలువగలదుగాని, పక్షి వాలితే తట్టుకోగలదా చిట్టీ!"

తన మనోభీష్టం తన తండ్రికి తెలుసును లెమ్మనుకొని ఆమె తన నిశ్చయాన్ని కార్యరూపంలో పెట్టదలచుకొన్నదై తనకు సన్నిహితురాలైన ఒక చెలికత్తెతో ఆయనను అడిగిం

చింది. తన కోరిక నెఱవేఱేవరకు తాను తపస్సు చేసుకొనుటకై అనుమతి నివ్వవలసిందిగా ప్రార్థించింది.

ఇలాంటి పట్టుదల తన కూతుకున్నదని అతను సంతోషించినాడు. తన పూజ్యపాదులు జనకుల అనుమతినంది ఆమె ఒక శిఖరమునకు వెళ్ళినది. ఆమె తపస్సుచేసినది కనుకనే ఆ శిఖరానికి తర్వాత లోకంలో గౌరీశిఖరమనే పేరు వచ్చినది.

తిరుగులేని మనోనిశ్చయంతో ఆమె తన హారాలను తీసివేసింది. పూర్వ మది కదలాడినప్పుడెల్లా తాను పూసుకున్న చందనం చెఱిగిపోతూ ఉండేది. అలాంటి హారాన్ని తొలగించి, బాలారుణవర్ణమైన కావినారచీరను కట్టుకున్నది. । తనపాలిండ్ల ఉన్నతితో ఆ నారచీర ప్రిదిలి అంత చిక్కగాఉన్నదల్లా కాస్త సడలిపోయినది.

మామూలుగా శిరోజాలతో ఎలాగైతే ఆమె ముఖం మనోహరంగా ఉండేదో అలాగే జడలు దాల్చినా అంత అందంగా ఉన్నది. తామరపూవు కేవలం ఒక్కతుమ్మెద బారుతోనే కాదు, నాచుతీవెతో కలిసినా అందంగానే ఉంటుంది మరి !

వ్రతధారణం కోసం ఆమె ముప్పేటలతో మౌంజిని నడుమున ధరించినది. అదే తొలిసారిగా ఆమె ముంజిని ధరించింది. కాబట్టే అదే అనుక్షణం తన ఒడలికి తాకి గగుర్పాటు కలిగిస్తున్నది. అందుతో మొలనూలు వేసుకుంటూ వచ్చిన నడుంపై ముంజిపోడవునా బాగా కందిపోయినది.

పూర్వం పెదవులకు లత్తుకపూయుటకు, తన మైపూత తాకున ఎఱ్ఱవడిన బంతిని ఆడుటకు మాత్రమే అలవాటు పడిన ఆమెచేయి ఇప్పుడు దర్భలను కోసుకొని వస్తున్నది. అందుతో పాప మావిడ వ్రేళ్ళు కోసుకొనిపోతున్నవి. ఆ కరమే ఇప్పుడు జపమాల త్రిప్పుట నలవరచుకుంటున్నది.

అమూల్యమైన హంసతూలికాతల్పం మీద పడుకొని, నిద్రలో పొరలినప్పుడు రాలిన తలలోని ఆ పూవులతోనే పూర్వ మామె ఒడలికి నొప్పికలిగేది. ఇప్పుడేమో తన చేతినే తలగడగ ఉంచుకొని కేవలం వట్టినేలపైనే పడుకుంటున్నదామె.

ఆ నియమ పరిపాలన ముగిసేవరకూ తన విలాస చేష్టితాలను సన్నటి లతలలోనూ, తన బిత్తఱిచూపులను లేళ్ళ కన్నుల లోనూ ముడుపుగా ఉంచి తర్వాత తీసుకొనవచ్చు లెమ్మను కొన్నట్టున్నదామె.

అలుపు సొలుపు లెఱుగనిదై పార్వతి స్వయంగా చెట్లకు తన పాలిండ్ల వంటి కడవలతో నీరుపోసి పెంచుతూ వచ్చినది. తర్వాత కుమారస్వామి జన్మించికూడా వానిమీదనున్న ఆమె పుత్రవాత్సల్యాన్ని అందువల్లనే తొలగించలేకపోయినాడు.

అశేషంగా తాను అడవిలో రాలిపడిన గింజలను దోసిలితో తినిపిస్తూ లాలిస్తూ వచ్చిన జింకలు ఆమెపై ఎంతో విశ్వాసంతో ప్రవర్తించినవి. ఆ నమ్మకంతోనే ఏదో కుతూహలం కొలదీ తనకళ్ళు పెద్దవా వానికళ్లు పెద్దవా అని కొలిచి చూచుకొనుటకు తగినంత దగ్గరలోని కవి రాసాగినవి.

విధిపూర్వకంగా స్నానంచేస్తూ, అగ్నికార్యం నెర వేరుస్తూ, వల్కలములను ధరించి, మంత్రపఠనం కావిస్తున్న ఆ గౌరీదేవిని దర్శించుటకై ఋషు లెందరో రాసాగినారు. ఔను! ధర్మవృద్ధుల విషయంలో వయస్సు ప్రమాణంకాదు మరి!

ఆ తపోవనమే ఆమె ఉనికితో పవిత్రమైనది. సహజ శత్రువులైన మృగములు తమపూర్వ మత్సరాలను విడనాడి మెలగసాగినవి. చెట్లు కోరినట్లెల్లా అతిథులకు పుష్పఫలాదుల నీయదొడగినవి. క్రొంగ్రొత్త పర్ణశాలలలో అగ్నులు వెలుగొందసాగినవి. అందుకే ఆవనమంతగా పావనమైనది.

ఈ విధమైన సులభతరమైన తపస్సు తనకోరిక తీర్చ గలది కాదని ఎప్పుడుతోచినా వెంటనే ఆమె తన లేత శరీరాన్ని కూడా లెక్కించకుండా మరింత కఠినతపస్సునకు ఉపక్రమిస్తూ వచ్చింది. బంతి ఆట ఆడినా అలసిపోయే ఆమె మును లవలంబించే కఠిన నియమాలను అవలంబింపసాగినది. అవు నామె శరీరం బంగారు తామరలతో నిర్మించినది. కాబట్టే లలితమే అయినా చాలా సారవంతం కూడా అది.

వేసవిలో ఆమె నాలుగువేపులా నాలుగు అగ్నికుండా లను వెలిగించుకొని నడుమ కూర్చుండి, కనుచూపును చెదర గొట్టే వెలుగు నోడించి నిశ్చలంగా సూర్యునిపరికిస్తూ పంచాగ్ని మధ్య తపస్సు చేసినది. ఆవిధంగా సూర్యకిరణాలతో అతి తప్తమైన ఆమె మోము కమలశోభను సంపాదించుకున్నది.

ఆమె కనుకొలకులలో మాత్రమే కాస్త నలుపు మెలమెల్లగా కాలూనసాగినది.

తాను కోరకనే తనపై బడుతున్న వాననీటితోనూ, రసాత్మకుడైన చంద్రుని కిరణాలతోనూ ఆమె పారణచేయ సాగినది. ఆవిధంగా చెట్లెలా బ్రతికేవో ఆమెకూడా అలాగే జీవించసాగినది. ఇట్లా ఆమె ఆకసమందున్న సూర్యాగ్నితోనూ, ఇంధన ప్రజ్వలితమైన హోమాగ్నులతోనూ పరితప్తురాలైనది. అందువల్లనే వేసవిపోయి తొలకరి చినుకులు పడగనే భూమినుండివలె ఆమె ఒడలినుండి ఆవిరి పైకెగసినది.

ఆ తొలకరిచినుకు లామె కనురెప్పలపై కాసేపు నిలచినవి. ఆ తర్వాత పెదవులను తట్టినవి. ఆ పిదప పాలిండ్లపైబడి చిద్రుపలు చిద్రుపలై పోయినవి. ఆనకనే ఆమె వళిత్రయంపై బడి జారి చాలసేపటికి నాభిని చేరుకున్నవి. ఎడతెరిపి లేకుండా గాలీ వానా వస్తుండగా ఆమె రాత్రిళ్ళు ఆరుబయట బండపై పడుకొంటున్నది. ఆ మహాతపస్సునకు సాక్షులుగా రాత్రులు తమ మెఱపు కళ్లను తెఱచుకొని చూస్తున్నట్లున్నవి.

విపరీతంగా మంచుకురుస్తూ, చలిగాలివీచే పుష్యమాస రాత్రులలో ఆమె నీటిలోనే నివసిస్తూ ఎడబాసిన చక్రవాక మిథునాలు పరస్పరం పిల్చుకుంటూ ఆక్రందిస్తుండగా జాలితో చూస్తూ, గడపసాగినది. తామర సువాసనలతో, వణకుతున్న పెదవు లనే ఆకులతో ఒప్పారే తన ముఖంతో మంచుకురిసి తామరతోటలు నశించిన ఆ నీటికి తిరిగీ పద్మసన్నిధి నామె చేకూర్చసాగినది.

తమంతతాముగా పండి రాలిన ఆకులను దిని తపస్సు చేయడం తపస్సులలోకెల్లా పరాకాష్ఠ అని చెప్తారు. మరి ఈ పార్వతి ఆ ఆకులనుకూడా తినడం మానివేసింది. కాబట్టే అపర్ణ అయినదని పూర్వగాథలు తెలిసినపెద్దలు చెప్తారు.

ఇలాంటి అనేక నియమాలతో తామరతూటికంటే లలితమైన తన అంగకాన్ని శ్రమింపజేస్తూ ఆమె అహర్నిశాలూ తపస్సుచేసినది; దృఢగాత్రులైన వారొనర్చే తపస్సు లన్నిటిని తన తపస్సుతో కించపరచివేసినది.

## కపట బ్రహ్మచారి ఆగమనం

అప్పు డక్కడ కొక బ్రహ్మచారి విచ్చేసినాడు. అతను నల్లజింకచర్మాన్ని, మోదుగుకఱ్ఱను చేతపట్టుకున్నాడు. బ్రహ్మ వర్చస్సుతో ఆయన వెలిగిపోతున్నాడు. మాంచి మాటకారి. బ్రహ్మచర్యాశ్రమం అలా రూపుదాల్చి వస్తున్నాడా అన్న ట్టాయన ఆ గౌరీతపోవనంలోనికి ప్రవేశించినాడు.

అతిథిసత్కారపరాయణ అయిన పార్వతి ఆ బ్రహ్మ చారిని గౌరవపూర్వకంగా ఎదురేగి సత్కరించినది. తనతోటి వాడేకదా, అయినా ఆమె అంతగా గౌరవించినదంటే అందుకు కారణమేం లేదు. నిగ్రహచిత్తులకు విశిష్టవ్యక్తులపై గౌర వాభిమానా లుండటం సహజంకదా !

అలా ఆమెచేసిన యథోచిత పరిచర్యలను ప్రతి గ్రహించినా డాయన. మార్గశ్రమను తీర్చుకొన్నట్లూ నటించి

నాడు. ఆ తర్వాత సౌమ్యదృష్టులతో ఆమెను చూస్తూ అతడు క్రమరీతిగా ఇలా అన్నాడు.

"అమ్మాయీ, ఇక్కడ నీ అగ్నికార్యాదులకు సమిత్కుశలు సులువుగా చిక్కుతున్నవా? స్నానపానాదులకు తగిన నీటిసదుపాయం ఇక్కడ ఉన్నదా? ఏదో శక్తికొలది తపస్సు చేసుకుంటున్నావా? ఈ మాట ఎందుకంటున్నానంటే ధర్మసాధనలో తొట్టతొలిది ఈ దేహం. దానిని చూచుకొనవలె గదా మరి! దానికే హానికలిగితే ఇక ధర్మనిర్వహణ యెలా సాధ్యమవుతుంది?

నీవు నీరుపోసి పెంచిన తీవెలు చివుర్చుతున్నవా? ఎప్పుడో లత్తుకపూయడంమానిన నీ అధరంతో ఆ పల్లవములు తులతూగుతున్నవా? నీ చేతిలోని దర్భలను ప్రేమతో లాగుకొని పోతున్న లేళ్లమీద నీ మనసు నెనరుతో నుంటున్నదా? తమ బిత్తరిచూపులతో అవి నీ కనులను పోలవలెనని ప్రయత్నిస్తున్నట్టున్నవి కదూ?

ఔను పార్వతీ, చక్కని రూపం పాపవృత్తికి దూరంగా ఉంటుం దంటారు పెద్దలు. ఆమాట నిజమే ననుకుంటాను. నీవే అందుకు నిదర్శనం. నీ సచ్ఛీలం తపస్వులకుకూడా ఉపదేశకమవుతున్నది మరి! సప్తర్షుల పూజకు పనికివచ్చే పూలతో నవ్వుతూ ఆకసంనుండి క్రిందికిజారుతున్న గంగానదీ జలాలతో కంటె, నీ సద్వర్తనంతోనే, నిర్మలమైన నీ నడవడితోనే ఈ హిమవంతుడు పవిత్రుడవుతున్నాడు. ఆయన వంశంకూడా పరమపావన మవుతున్నది.

నిన్ను చూస్తుంటే ధర్మార్థకామము లనే త్రివిధ పురుషా ర్థాలలో వానిలోకెల్లా సారభూతం ధర్మమేనని తోస్తున్నది. కాకపోతే అర్థకామములపై మనసు పోనీక ఒక్క ధర్మాన్నే నీ వెందుకు అవలంబిస్తున్నావు? నీ సత్కారా లందుకున్న నన్ను అన్యునిగా భావించవద్దు. సత్పురుషుల సాంగత్యం సాప్తపదీనం (ఏడు మాటలతో నేర్పడునది) అని విద్వాంసులు చెప్తారు.

ఈ చనవును పురస్కరించుకొని సహనశీలవైన నిన్ను బ్రాహ్మణ సహజ చాపల్యంతో నేను నిన్నొక సంగతి అడుగ దలచుకున్నాను. అదేమీ రహస్యం కాకపోతే తపోధనురాలా నాకు సమాధాన మివ్వు.

నీవు పుట్టిన వంశమా బ్రహ్మవంశం. నీ రూపమా ముజ్జ గాలలోని అందం ఒకచో ముద్దగా చేసినట్టున్నది. నీకు భోగ భాగ్యాలకోసం వెదుకవలసిన అవసరం లేదు. మరి వయసా లేతది. మరి ఇవేవీ కాక ఇంతకంటె మరేది ఈ తపస్సులో సాధించ నెంచినావమ్మా!

భరింపరాని అవమానమో, అనిష్టమో జరిగితే కూడా ఇలాంటి వ్రతపరిపాలనకు దిగడం కలదు. మానిను లలాంటి పని చేయడం లేకపోలేదు. కానీ ఎంత ఆలోచించినా అలాంటిది కూడా నీవిషయంలో కానరావడం లేదుకదా!

నీ ఆకారం చూస్తే ఏ శోకమూ, ఏ అభిభవమూ పొందు నదిగా తోచదు. అయినా, తండ్రిగారింటిలో అవమానానికి ఆస్కార మేమున్నది? మరి మరొకరు నిన్ను అభిభవించ

గలరా ? పాముపడగమీాది మణికోసం చెయిచాపువా డెవ డుంటాడు ?

మరి ఇలాంటప్పుడు నీవు మంచిప్రాయంలో ఈ నారచీర లను, ముదిమిలో ముచ్చటగొల్పే వీనిని ఎందుకు ధరించావు; నగలూ నాణ్యాలూ ఎందుకు తీసివేసినావు ? చందమామా, చుక్కలూ మిలమిలా మెరిసిపోతున్న రాత్రి అరుణసంగమార్హ మగునా ? నీవే చెప్పవమ్మా.

పోనీ ఏదో స్వర్గ మాశించి తపస్సు చేస్తున్నావా అంటే నీ జనకుని ప్రదేశాలే దేవభూములు. మరి అనురూప వరుని కోసం ఈ తప స్సంటావా అది సరికాదు. రత్నాన్ని మరొకరు వెదుక్కుంటూ రావలసిందే తప్పా, రత్నం మరొకరిని వెదు క్కుంటూ వెళ్ళదు.

ఆ ఈ వరునిమాట ఎత్తగనే నీవు విడిచిన వేడి నిట్టూర్పు నీమనసును వెలార్చుతున్నది. అయినా నాకు సందేహంగానే ఉన్నది. అసలు నీవు కోరవలసినవాడే కనబడడుకదా, మరి కోరి నీకు దొరకనివా డెవరుంటారు ? ఎవరైతేనేమిగానీ నీవు కోరిన యువకు డెవరో చాలా గట్టివాడుగా కానవస్తున్నాడు సుమా ! కాకపోతే ఎంతకాలంగానో చెవిలో కలువపువ్వు నుంచుకోకుండా శూన్యములైన నీ కపోలాలపై వరికంకులవలె పచ్చనైన జడలు చిక్కువడి వ్రేలాడుతుంటే అలా చూస్తూ ఊరకుంటాడా ?

ఈ మునివృత్తితో దేహం కృశించిపోగా, ఎంత కెండి విభూషణాస్పదాలైన నీ అంగములు వాడిపోగా పగటిపూట

చంద్రరేఖవలె తోచే నిన్నుచూస్తే, ఏ సహృదయుని మనసు ఖిన్నంకాదు ? ఈ చతురావలోకనములు, అరాళ పక్ష్మములు గల నీ కంటికి కనబడకుండా ముఖం తప్పించుకుంటున్న ఆ నీ ప్రియు డెవడోగాని తన సౌందర్యగర్వంతో వంచితుడయి నట్టుగా నేను భావిస్తున్నాను.

అయినా పార్వతీ ఇక ఎంత కాల మిలా శ్రమపడతావమ్మా! నేను నా బ్రహ్మచర్యాశ్రమంలో సంపాదించుకున్న పుణ్యం చాలానే ఉన్నది. అందులో సగం నీకిస్తాను. నీ మనోరథం సిద్ధించుగాక. అయితే ఆయన ఎవరోమటుకు స్పష్టంగా నాకు తెలుసుకోవాలని ఉన్నది."

ఇలా ఆ వచ్చిన బ్రాహ్మణ వటువు అడుగగా ఆమె తన మనసులోని మాటను తానుగా చెప్పలేక పోయినది. తన ప్రక్కనే ఉన్న తన చెలికత్తె నలా కనులువాల్చి చూచినది. అందుతో గ్రహించి ఆ సఖి ఇలా అన్నది.

"తపస్వీ, నీకంత కుతూహలంగా ఉంటే చెప్తాను విను. కమలాన్ని ఎండను వారించే గొడుగుగా చేసికొన్నట్లు తపస్సుకు సాధనంగా తన లలిత సుకుమార దేహాన్ని ఈవిడ ఎందు కిలా చేసుకున్నదో చెప్తాను విను.

సకలైశ్వర్యసంపన్నులైన చతుర్దిక్పాలురను తిరస్కరించి ఈ మానిని పినాకపాణిని పతిగా పొంద దలచుకున్నది మన్మథదహనంతో ఆయన రూపంతో వశమయ్యే వాడు కాడని తేలిపోయినా ఆ శివుని వరించిన దీమె. ఆనాడు మారుడు వేసిన బాణం శివుడు హుంకరింపగా ఆయనకు తగుల

కుండానే తిరిగి పోయింది. అలా రూపం పోయినా ఆ కాముని బాణం ఈమె హృదయంలో గాఢంగా నాటుకొన్నదయ్యా.

అప్పటినుంచి ఈవిడ తన జనకునింటిలో మదనపీడితయై గడపినది. తిలకానికి తగిలి ధూసరమైన చూర్ణకుంతలాలతో ఈమె మంచుపేరుకున్న చల్లని బండలమీద కూడా ఏ మాత్రం తన విరహాజ్వరాన్ని తగ్గించుకొనలేకపోయినది.

శివకథలను గానంచేయుపట్టుల ఆ పినాకి పేరు రాగనే గొంతు డగ్గుత్తికపడి పదాలు గొంతుకలోనే జారిపోతుండగా ఈమె పాడడం వినికూడా పాడుతున్న కిన్నరరాజకన్యలు పలుమారు పాపం మనఃఖేదంతో ఏడ్చివేసేవారు. అంతేకాదు. రాత్రులందు నిద్రపట్టక వేకువవేళల కనులుమూసుకొని 'నీలకంఠా! ఎక్కడికి వెడుతున్నావు?' అంటూ శూన్యంలోనే చేతులుచాపి కౌగిలించుకుంటూ గభాలున మేల్కొనేది.

మరి రహస్యంగా తానే ఆ చంద్రశేఖరుని చిత్రాన్ని చిత్రించేది. "నీవేదో సర్వాంతర్యామివని పెద్దలంటూరే! మరి నామనసు నెఱుగకుంటివేమి ప్రభూ!" అని ఆబొమ్మనే ఈ ముద్దరాలు ఎత్తిపొడిచేది.

ఇలా కొంతకాలం చూచి ఆ లోకేశ్వరుని పొందుటకు మరొక మార్గం కానరాక, తన తలిదండ్రుల అనుజ్ఞ తీసికొని మా సఖి తపోవ్రతం అవలంబించాలని ఈ వనానికి వచ్చినది. ఇక్కడ ఈమె నాటిన విత్తనాలు మొలిచిన చెట్లే ఈమె తపస్సాక్షులుగా నిలిచి పంటకు వచ్చినవి. కాని తన కోరికమటుకు ఫలోదయాభిముఖం కాదుకదా, ప్రరోహాభిముఖమైనాకాలేదు.

ఆ అలభ్యుడీమె నెప్పుడు అనుగ్రహిస్తాడో! కన్నీళ్ళతో నేమిామె నిలా ఎన్నాళ్ళు చూస్తూ ఉండవలసి ఉన్నదో! తెలియడంలేదు. అనావృష్టితో ఎండిపోయిన నేలను వర్షంతో ఇంద్రు డనుగ్రహించినట్లు తపఃకృశురాలైన ఈమెపై ఆ శివు డెప్పుడు దయచూపుతాడో ఏమో!"

ఇంగితజ్ఞురాలైన ఆ చెలి అలా మనసిచ్చి వివరించగా, నైష్టిక సుందరుడైన ఆ వటువు తన ఆనందాన్ని ప్రకటించకుండా "ఏమమ్మా పార్వతీ! ఇది నిజమా? లేక మిా చెలి నవ్వులాట కిలా అంటున్నదా?" అని తిరిగీ పార్వతి నడిగినాడు.

అపు డా పార్వతి వ్రేళ్ళు ముడుచుకొని ముంజేతికి స్ఫటిక జపమాలను తగిలించుకుంటూ చాలసేపు మౌనంగా ఉండిపోయినది. ఆ తర్వాత అతి కష్టంపై క్లుప్తంగా ఇలా అన్నది.

"ఔను తపస్వీ, మీరు విన్నదంతా నిజమే. మహోత్తమ పదవికోసం నేను ప్రాకులాడుకున్నాను. అంతటి పుణ్యాని కీ మాత్రం తపస్సు చాలుతుందా ఏమైనానా? అయినా కోరికల కేమున్నదయ్యా, అవి ఎంత అలభ్యమైనవానినైనా ఆశించగలవుకదా!"

అని ఆ రెండు మాటలతో గారె మిన్నకున్నది.

అప్పు డామెతో ఆ వటు విలా అన్నాడు. "ఆ ఈశ్వరుని నే నెఱుగుదునమ్మా. నీవు తిరిగి ఆయనకోస మిలా తపస్సు చేస్తున్నావా? అమంగళాచారాలుగల అతని సంగతి ఆలోచిస్తే నీ విలా అతనికై ఆరాటపడడం నాకేమంత ఉత్సాహకరంగా

లేదు. నీపట్టుదల అయోగ్యవిషయంపై ప్రవర్తిల్లినదే అనే నా చింత. అత నొకవేళ పెళ్ళి కంగీకరించినా ఆ నాగకంకణాం ధరించిన వాని చేతిని తొలిసారి నీచేతితో ఎలా పట్టుకొన గలవమ్మా చిన్నదానా! అయినా నీవే కాస్త ఆలోచించు. కలహంసలు అల్లిన పెళ్ళికూతురు కట్టుకునే దుకూలమూ, నెత్తురు కారే ఏనుగుచర్మమూ ఇవి రెండూ ఎలా అతుకుతాయమ్మా!

పారాణి పూసుకొని ముత్యాలశాలలలో పూలుచల్లిన తావులలో ఉంచవలసిన నీ అడుగులను ఎటుచూచినా శవాల కేశములతో నిండిన శ్మశానవాటికలలో నుంచుటకు ఎవరు అంగీకరిస్తారు ? నీ కా శివుని యెడద సులభలభ్యమే ననుకో. అయినా అంత అయోగ్యమైనది మరొక టున్నదా? హరిచందనం అలదుకొన్న నీ ఎడదపై కాటిబూడిద పూసుకొందువా ?

అదిగాక తొలుతనే నీవొక అవహేళనకు గుఱికావలసి వస్తుంది. పెళ్ళిచేసుకొని ఏనుగుమీద ఊరేగవలసిన నీవు, ముసలియెద్దునెక్కి బయలుదేరితే చూచిన జనమంతా విరగబడి నవ్వుతారు!

ఇంతదాకా కళావంతుడైన చంద్రుని మహాకాంతివంతమైన కళ ఒకదాన్ని గూర్చే వానికి దక్కినదన్న కారణంతో లోకం విచారపడుతూ వచ్చింది. ఇప్పుడు లోకాలోకనాలకు కౌముదివైన నీవుకూడా అతగానినే పొందగోరడంతో జనమిప్పుడు నిన్నుగూర్చికూడా విచారపడవలసి వస్తుంది. మీ యిద్దరిని గూర్చి పాపం ఇలా అయిపోయిరే అని లోకం జాలి పడుతుం దిక.

కన్య అందం కోరుతుందనీ, తల్లి ధనం కోరుతుందనీ, తండ్రి విద్య-వంశం కోరుననీ, బంధుగులు షడ్రసాన్నం ఆశిస్తారనీ వివాహవిషయంలో అనడం మామూలు. ఈ వరునిలో అందులో ఏ గుణ మున్నది ?

రూపమా లేదు — అతను విరూపాక్షుడు. కులీనతా లేదు - అతని పుట్టుకగుట్టే మన మెఱుగము. ఇక ధనమా వాని దిగంబరత్వమే చాటి చెప్పుతున్నది-గతిలేనివాడని. వరులవిషయంలో వెదకే గుణాలలో మరి ఒక్కటిగా నొక్కటైనా అతగానిలో ఉన్నదా ?

ఈ దుస్సంకల్పంనుంచి నీ మనసును త్రిప్పుకోవమ్మా గారీ! అలాంటి వాడెక్కడ ? పుణ్య లక్షణ సంశోభితురాల వైన నీ వెక్కడ ? కాటిలోని శూలమునకు యజ్ఞవాటికలో యూపానికిచేసే పూజాది సంస్కారాలు చేయడానికి ఏ సత్పురుషు డంగీకరిస్తాడు ?"

అని ఆ వటువు ప్రతికూలంగా మాటలాడుసరికి పార్వతి పెదవులు వణకుతూ ఆమె కోపాన్ని వెలార్చినవి. కనుకొనల నెఱ్ఱనైన ఆమెకనులు ప్రక్కకు తిరిగినవి. బొమలు ముడివడినవి. అలా కోపోద్దీప్త అయిన పార్వతి అతనితో ఇలా అన్నది :

"ఆ పరమేశ్వరుని యథార్థ తత్త్వం నీకు తెలియదు. అందుకనే ఇలా అంటున్నావు. అసాధారణమూ, అగోచర కారణమూ అయిన మహాత్ముల ప్రవర్తనను మందులు ఏవగించుకుంటారు.

జనం మామూలుగా అమంగళములు ప్రతిహతం కావాలని గాని, ఐశ్వర్యాదులు రావాలనిగాని, ఏవో కొన్ని మంగళకరము లనే వేష భాషాదులను స్వీకరిస్తారు. లోకానికే శరణ్యుడూ, ఏ కామనా లేనివాడూ, అయిన ఆ శంకరునకు ఏ ఆశతోనో చేసుకొనే ఈ మంగళాచరణాదులతో నేమిపని?

ఆయన దరిద్రుడైనా సర్వసంపదలకు మూలమైనవాడు. కాటిలో నివసిస్తున్నా ముల్లోకాలకూ అధీశ్వరుడు. భయంకర రూపుడైనా శివుడు. ఆహరుని తత్త్వం ఎఱిగినవా రెవరున్నారు?

ఆయన రూపం సకలభూషణ సంశోభితం కావచ్చు; పాములను చుట్టుకొన్నదైనా కావచ్చు; ఏనుగుచర్మం కట్టుకో వచ్చు; దుకూలాలనూ ధరించవచ్చు; కపాలధారీ కావచ్చు; చంద్రశేఖరమూ కావచ్చు. ఏమైనా ఆ విశ్వమూర్తి రూపును గూర్చి ఏమని నిర్ధరించగలం!

ఆయన శరీర సంపర్కంతో చితాభస్మ పరిశుద్ధికి కారణ మవుతున్నది. కాబట్టే నాట్యక్రియాచ్యుతమైన దానిని దేవ తలు తమ శిరసులపై పూసుకుంటున్నారు.

ఐరావతమనే మత్తమాతంగాన్ని ఎక్కి తిరిగే ఇంద్రుడు ఈ ఎద్దునెక్కి తిరిగే పేదవానికాళ్ళ కెఱగుతున్నాడు. తన సిగ లోని కల్పవృక్ష కుసుమాలపరాగంతో ఈయన పాదాంగుళు లను అరుణితం చేస్తున్నాడు. మరి పేదవాడే కావచ్చు; కాని మహేంద్రుని ఐశ్వర్య మాయన కాలిదగ్గరకు వస్తున్నది.

అయితే ఒకటి. ఆత్మదూరుడవై ఆయనను నిందిస్తూ తప్పులే చెబుతున్నా నీవు ఒక్క సరైనమాట మాత్రం అన్నావు. నిజమే నీవన్న ట్లాయనపుట్టుకనుగూర్చి ఎవరికీ తెలియదు. ఆత్మ భవుడైన బ్రహ్మకే కారణుడనే శివునిపుట్టుక ఎవరికి తెలుస్తుందు మరి!

ఇంతకూ ఈ వాదోపవాదా లెందుకు? నీవు విన్నట్లు ఆయన పూర్తిగా అలాంటివాడే కానీ! అయినా ఆయనంటే నామనసు పూర్తిగా అనురక్తమై ఉన్నది. నామనసు మరొక రేమనుకుంటున్నారో విచారించి ప్రవర్తిస్తుందేమిటి? దాని స్వేచ్ఛ దానిది."

అన్న పార్వతి తిరిగి ఆబ్రాహ్మడేదో అంటున్నట్టు చూచి చెలికత్తెతో అన్నది:

"సఖీ! అత నేదో ఇంకా మాట్లాడాలన్నట్లు పెదవులు కదిలిస్తున్నాడు. అతను నోరెత్తకుండా ఆపించు. పెద్దలను నిందించేవారేకాదు, ఆ నిందలను వినేవారుకూడా పాపాలకు పాత్రులవుతారు. అయినా అసలిక్కడినుంచి నేనే వెళ్ళిపోతే అస లేబాధా లేదుకదా!"

అంటూ ఆమె తనపైన వేసుకొన్న నారచీరె జారిపో తుండగా కదలినది. అప్పుడు ఆ వటురూపం వదలి శివుడు చిఱునవ్వుతో తన స్వస్వరూపంతో నిలిచి ఆమె చేయిని పట్టు కున్నాడు.

ఆయనను చూడగనే ఆమె ఒడలెల్లా కంపించి పోయినది; చిఱుచెమటలు పట్టినవి. ముందుకు వేయవలెనని ఎత్తిన అడుగలాగే ఎత్తిన దెత్తినట్లే నిలిచిపోయినది. దారిలో అడ్డు తగిలిన కొండముందు తొట్రుపడే నదివలె పార్వతి పోనూ లేదు, ఉండనూ లేదు.

"సుకుమారీ ! ఇకమీఁద నీకు దాసుడను. నీ తపస్సుతో నన్ను కొనుక్కున్నావు—" అని చంద్రశేఖరుడయిన ఈశ్వరుడన్నాడు. అంతతో ఆమె పట్టిన వ్రతనియమాదులతో డిశ్రమ ఎల్లా వెంటనే తీరిపోయినది. ఫలోదయం కాగానే ఎంతశ్రమ అయినా ఇట్టే తొలగిపోయి, యథాపూర్వస్థితి నవనవోన్మేష మగునుకదా !

ఇది పంచమ సర్గ.

# షష్ఠ సర్గ

ఆపిదప గౌరీదేవి విశ్వాత్ముడైన శివునకు తన చెలితో చాటుగా చెప్పి పంపినది. "నన్ను కన్యాదానం చేయవలసిన వాడు మా తండ్రి హిమవంతుడు. ఆయన అంగీకారం పొందండి." అని ఆ సందేశ సారాంశం. ఆ చెలి ఆ మాట చెప్తుండగా తాను మిన్నకుండా నిల్చున్న పార్వతి, వసంతంలో కోకిలను పలికిస్తూ ఏమీ ఎరుగనట్టున్న మావికొమ్మవలె నుండినది.

"సరే, అలాగేకాని"మ్మని కష్టంమీద ఆ ఉమను వదలి ఈశ్వరుడు వెడలిపోయినాడు. సప్తర్షులను తలచుకొన్నాడు. వెంటనే తమ కాంతిపుంజంతో గగనతలాన్ని వెలిగిస్తూ ఆ తపోధనులు అరుంధతీ సహితులై ఆయన ఎదుట నిలుచున్నారు.

తీరంలోని మందారపుష్పాలు రాలుతుండగా అలలతో తొలగించివేస్తూ, దిగ్గజ మదగంధంతో వాసితమైన గగన గంగానదీజలాలలో వారు స్నానమాడి వచ్చారు. బంగారు నారచీరలు కట్టుకొని, ముత్యాల జందెములు వేసుకొని, రత్నాల జపమాలలు పట్టుకొని వానప్రస్థాశ్రమం పుచ్చుకున్న కల్పవృక్షాలేమో అన్నట్లున్నారు. అంతేనా సప్తర్షి మండలం సూర్యునికి పైనిదికదా. అందుకనే క్రిందుగా తన రథాశ్వాలను తోలుకుంటూ తన కేతనాన్ని వంచి సూర్యుడు వారిని తలపైకెత్తిచూస్తూ వారికి నమస్కరిస్తూ ఉంటాడు. అంత గొప్పవారు వారు.

ప్రళయకాలంలో లోకమంతా జలమయంకాగా మహా విష్ణువు మహావరాహరూపంలో భూమిని తన కోఱతో ఎత్తి నాడు. తన భుజలతలతో భూదేవి ఆ కోఱను పట్టుకొని ఉండగా ఆమెతోపాటు వీరుకూడా ఆనాడక్కడ విశ్రాంతి తీసుకున్నారు. అంత శాశ్వతులు వీరు. విశ్వకారణుడైన బ్రహ్మ తరువాత మిగిలినసృష్టిని పూర్తిచేసే పురాతన బ్రహ్మలని పురావిదులు ప్రస్తుతిస్తూ ఉంటారు వీరిని. పూర్వం చేసుకున్న తపస్సుల పరిపాకాన్ని అనుభవిస్తూనే ఇంకా తపస్సు చేసుకుంటూనే ఉన్న ఆ సప్తర్షులు శివునిముందు ప్రత్యక్షమై నిల్చినారు.

వారినడుమ అరుంధతి ఉన్నది. ఆమె తన పతిపాదాల పైనే చూపులు నిలిపి ఉన్నది. వారు చేసుకున్న తపస్సుల ఫలమే ఇలా సాక్షాత్కరించెనా అన్నట్లున్నది.

శివుడామెను ఆ మునులతోపాటు గౌరవంతో చూచినాడు. స్త్రీ పురుషుడు అన్న వివక్షకాదు, సత్పురుషుల సచ్చరిత్రమే ప్రధానము. మరి ఆమెను చూడడంతో తనకూ భార్య కావలెనన్న ఆకాంక్ష ఈశ్వరునిలో పైకొన్నది. ధర్మక్రియలన్నిటికి సద్భార్యలు మూలకారణంకదా !

అట్లా పార్వతిని పెళ్ళాడవలెనన్న భావం శర్వునిలో తలసూపగనే, పూర్వాపరాధంతో భయభ్రాంతుడై ఉన్న మన్మథుని మనస్సు నిట్టూర్చింది. ఇంతలో ఆ వచ్చిన మును లెల్లరు పరమేశ్వరునికి నమస్కరించి, సంతోషంతో ఒడలెల్ల పులకితం కాగా ఆయనతో ఇట్లన్నారు.

"సుష్టుగా వేదాలు సమధ్యయనం చేసినందుకు, అగ్నిలో హోమం చేసినందుకు, తపస్సు చేసినందుకు ఫల మిప్పుడు మాకు దక్కినది. లోకేశ్వరుడవైన నీవు మమ్ములను తలచుటతో కోరికల కావల నీమనస్సులో మేము మెదలుటతో ధన్యుల మైతిమి. నీవెవ్వరి మనసులో వసింతువో వారే పుణ్యులు. మరి బ్రహ్మకే కారణుడవైన నీ మనసులోనే వర్తించిన మా సంగతి వేరే చెప్పవలెనా! సూర్య చంద్రాదులకంటె ఉన్నతమైన పదవి నందుకున్నాము. ఇప్పుడు నీవు మమ్మ స్మరించుటతో అంతకంటె పరమోన్నతమైన పదము నందు కొంటిమి.

మీ రిలా మమ్మ గౌరవించుటతో మా మీద మీ కెంతో అభిమాన మేర్పడినది. ఉత్తము లభిమానించినప్పుడే సహజంగా తమగుణాలపై తమకు విశ్వాస మేర్పడుతూ ఉం టుంది. నీవు మమ్మ తలచుటతో మాకెంత సంతోషం కలిగి నదో మేము మీ కెరిగింపవలెనా ! నీవు దేహులందరికీ ఆత్మవు కదా !

నీవు మాకు ప్రత్యక్షంగా కనబడుతున్నట్టె ఉన్నా నిన్ను పూర్తిగా మే మెఱుగము. అనుగ్రహించి నీతత్త్వం వివరించు. నీవు బుద్ధికతీతుడవు. ఆ తత్త్వం మాట అటుంచి ఈ కనబడు తున్న నీ రూపమే మాకు తెలియదు. సృష్టించే నీ అంశయా ఇది ? కాక లోకరక్షకమైన అంశమా ? లేక విశ్వసంహారాం శయా ? ఏది ఈ నీరూపము? అయినా ఇది మరీ పెద్ద కోరిక. అదలా ఉండనీ. మమ్ములను సంకల్ప మాత్రంతో పిలిపించావే

అందుకు హేతువేమి? ఆజ్ఞాపించు - మే మేం చెయ్యవలెనో చెప్పు."

అని ఆ మునులు కోరగా పరమేశ్వరుడు తన సిగపై నున్న చంద్రవంక వెలుగులను తన దంతకాంతులతో మరింత పెంచుతూ ఇట్లా అన్నాడు.

"నా ప్రవృత్తు లేవీ స్వార్థములు కావు. ఆ సంగతి మీా రెఱుగుదురు. కేవలం అష్టమూర్తులతో నే నిలా సూచితుడ నవుతున్నాను. అందువల్ల నే నన్నిప్పుడు దేవతలు శత్రుపీడితులై తమ కొఱకు సేనానిని ప్రసాదింపవలెనని ప్రార్థిస్తున్నారు; దప్పిగొన్న చాతకాలు మేఘునికోసం ఎదురు చూచినట్లు చూస్తున్నారు. అలాంటి సేనానిని పుత్రునిగా బడయడంకోసం పార్వతీదేవిని ఆకాంక్షిస్తున్నాను. అగ్న్యుత్పత్తి కోసం యజమాని అరణి నాశించినట్లు గౌరి నాశిస్తున్నాను.

మీారు హిమవంతునివద్దకు వెళ్ళి నా కామె నివ్వమని మీారడగాలి. మీావంటి మంచివా రేర్పరచిన సంబంధములు వికటింపవు సుడీ. ఆయన ఉన్నతుడు - నిలువరం కలవాడు. భూ భారం వహిస్తున్నవాడు. అలాంటివానితో వియ్యమందడం నాకూ మంచిదే.

మరి కన్యార్థం వెళ్ళి ఆయనతో ఏమిచెప్పవలెనో మీాకు నే నుపదేశింపను. అసలు మీారుచేసినదే ఆచారంగా ప్రవర్తిల్లుతుందని ప్రసిద్ధికదా! పూజ్యురాలు అరుంధతిని కూడా ఈ విషయంలో సాయంగా తీసుకోండి. తరుచుగా ఇలాంటి శుభకార్యాలలో స్త్రీలే సమర్థ లంటారు.

కాబట్టి మీ రీపని నెరవేర్చడం కోసం హిమవంతుని పట్టణం ఓషధ ప్రస్థానికి బయలుదేరండి. మనం తిరిగీ మహా కోశ పర్వతతటం మీదనే కలుసుకుందాము.” అని ఆయన మిన్నకున్నాడు.

ఈ విధంగా తపస్వులందఱకు ఆద్యుడైన ఆ శివుడే పరిణయోన్ముఖుడు కాగా, తాము పెళ్ళిచేసుకుంటిమే అన్న సిగ్గు నా సప్తర్షులు వదలిపెట్టిరి. ఆయనే చేసికుంటుండగా తాము చేసుకొనడంలో సిగ్గిలవలసిన దేమున్నదిక !

మంచిదనిచెప్పి ఆ ముని లంతట బయలుదేరినారు. శివుడూ తానుచెప్పిన ఆ తటంగూర్చి వెళ్ళినాడు. సప్తర్షు లలా వినీలాకాశంపైని కెగిరి మనోవేగంతో ఓషధప్రస్థం చేరుకున్నారు.

సర్వసంపన్నిలయమైన అలకాపురినే కొనివచ్చి, స్వర్గంలో పట్టక మిగిలిపోయిన జనంకోసం ఇక్కడ ఉంచిరా అన్నట్లున్నదా హిమవంతుని పట్టణం. దానిచుట్టూ గంగానది పారుతున్నది. దాని కోటలోపల ఓషధులు వెలుగొందుతున్నవి. పెనుమణుల ప్రాకారాలతో నున్న ఆ పురి లోసకూడా సుందరంగా నున్నది.

అక్కడి ఏనుగులు సింహాభయం లేనివి. అక్కడి అశ్వములు బిలములలో పుట్టినవి. అక్కడి పౌరులు యక్షులు, కింపురుషులు. అక్కడి స్త్రీలు వనదేవతలు. అక్కడి ఇళ్లపై మబ్బులాడుతూ ఉంటాయి. వాని ఉరుములకు ప్రతిధ్వనులా అన్నట్లు ఆ ఇళ్లలో మురజధ్వనులు వినవస్తుంటాయి. అక్కడ

కల్పవృక్షాల కొమ్మలపై వ్రేలాడుతున్న అంశుకాలే పౌరుల ప్రయత్నం అక్కరలేకయే గృహయంత్రపతాకాలవలె ఒప్పారుతున్నవి. అక్కడి స్ఫటికమణి నిర్మిత ప్రాసాదాల పాన గోష్ఠీ ప్రదేశాలలో నక్షత్రాల ప్రతిబింబాలుపడి పుష్పోప హారాలవలె కనబడుతుంటాయి.

అక్కడ రాత్రులయందుకూడా ఓషధులు దీపాలవలె వెలుగుతుండడంతో దుర్దినాలలోకూడా అభిసారికలకు చీకటి అన్నదే తెలియదు.

అక్కడివారి వయసు, యౌవనంతోనే ఆగిపోతుంది. అక్కడ మన్మథుడు తప్ప మరొక మారకుడు లేడు. అక్కడ రతిఖేద సముత్పన్నమయిన నిద్ర ఒక్కటే తెలివితప్పినట్లగపడు తుంది. మఱొకప్పుడు వారికి మైమఱపే కలుగదు మరి!

అక్కడి పౌలతులు పౌలయలుకలలో బొమముడులు పెట్టి, పెదవు లదరుతుండగా కోమల తర్జనాలతో బెదరిస్తూ ఉంటే ప్రియులు పాపం వారి అనుగ్రహం కోసం అభ్యర్థిస్తూ ఉంటారు.

అక్కడి బాటసారులెల్లా విద్యాధరులే. వారు కల్ప వృక్షాల నీడలలో నిద్రిస్తూ ఉంటారు. ఆ ఊరికి ఉద్యానంగా బయట సుగంధబంధురమైన గంధమాదనపర్వతం ఉంటుంది.

అలాంటి ఓషధ ప్రస్థాన్ని ఆదివృద్ధులు చూచి అయోధ్యా పుణ్యఫలంగా స్వర్గాన్ని నిర్దేశించి సుకృతాత్ములను దైవం వంచించెనే అని కించపడినారు.

అగ్నిజ్వాలలను చిత్రించినట్టు నిటారుగానున్న జడలతో వారు ద్వారపాలకులు తలలెత్తి చూచుచుండగా హిమవంతుని భవనంలో దిగినారు. వయసునుబట్టి వరుసగానున్న ఆ ముని పరంపర నీటిలో వరుసగానున్న సూర్యబింబశ్రేణివలె కాన వచ్చినారు.

వారినిచూచి దూరాననే ఎదురువచ్చినాడు హిమవంతుడు. గురుపాదాఘాతాలతో భూమిని క్రుంగజేయుచూ పూజాద్రవ్యాలను చేకొని వారిని సమీపించినారు.

ధాతు తామ్రమైన అధరం కలవాడు, ఉన్నతుడు, దేవదారు మహాబాహుడు, సహజశిలావక్షుడు అయిన అతను హిమవంతుడని సువ్యక్తమైనది. ఆయన విధివిధానయుతంగా ఆ పరిశుద్ధ చరిత్రులను సత్కరించి స్వయంగా దారిచూపుతూ అంతఃపురంలోనికి కొనిపోయినాడు. అక్కడ వారిని వేత్రాస నాలపై కూర్చుండజేసి తాను కూర్చుని హిమవంతుడు అంజలి బద్ధుడై వారితో ఇట్లా అన్నాడు :

"మబ్బు పట్టకనే వాన వచ్చినట్లూ, పూవు కనిపించకనే కాయకాసినట్లూ, అనుకోకనే లభించిన మీ దర్శనం నాకు ప్రతిభాసిస్తున్నది. మీ అనుగ్రహంవల్ల మూఢుడు బుద్ధుడైన ట్లుగా, ఇనుము బంగారమైనట్లుగా, నేలనున్నవాడు స్వర్గాన్ని అరోహించినట్లుగా నేను ధన్యుడనయినట్లు భావిస్తున్నాను.

నేటినుంచి తమ పాపపరిహారార్థం సర్వభూతములు నన్ను చేరుకొనగలవు. మీరు మెట్టుటచే ఈ తావు తీర్థప్రాయమైనది.

రెండే రెండు నన్ను పావనంచేసినట్లు భావిస్తుంటాను — ఒకటి నా తలపై గంగానది పడడం, రెండు మీ అడుగులు కడిగిన నీళ్లు నా తలపై చల్లుకొనడం—ఈ రెండే నన్ను పవిత్రుని గావించినవి.

నా స్థావరరూపమైన ఈ పర్వతంపై తాము పాదములు మోపినారు. జంగమరూపుడనైన నాతో మీరు దాసునిగా పనిగొంటున్నారు. ఈ విధంగా రెండుగానున్న నాపై తమ అనుగ్రహం పూర్తిగా కలిగినట్లు తలంచుతున్నాను.

దిశాంతాలదాకా వ్యాపించిన నా అంగములుకూడా మీ రాకతో నాలో ఉద్బుద్ధమైన సంతోషాన్ని భరింపలేక పోతున్నవి. మహాకాంతియుతులైన మీ దర్శనంతో నా కొండగుహలలోని తమస్సుమాత్రమే అపాస్తం కాలేదు. నాలోని రజస్సుకూడా అపాస్తమైనది.

మహానుభావులారా! మీకు నాతో కావలసిన పని ఏమీ ఉన్నట్లు కానరాదు. ఒకవేళ ఉంటే అది నెరవేరకుండా ఎలాపోతుంది? అయినా కేవలం నన్ను పరిపూతుని చేయుటకే మీరిలా విజయం చేసితిరని అనుకుంటున్నాను.

అయినా మీకు కావలసినది ఏదీ లేకపోయినా నాకేదో ఆనతి ఇవ్వవలసిందిగా ప్రార్థిస్తున్నాను. ప్రభువులు కింకరుల కేదో పనిచెప్పడం ద్వారానే అనుగ్రహం చూపగలరు మరి!

ఇదిగో మీ ముందు నేనున్నాను. ఇదిగో ఈ ప్రక్కనే నా భార్య ఉన్నది. మా వంశానికి ప్రాణమైన ఇదిగో ఈ నా

పుత్రిక పార్వతి ఉన్నది. మా ముగ్గురిలో మీ కెవరితో ఏమి పనికావలెనో సెలవివ్వండి. ఇక మిగత బాహ్యా వస్తువులపై మీకు ఆస్తలేదని నాకెలాగూ తెలుసు. అవి కావలసినా నావద్ద లెక్క లేనన్ని ఉన్నవి."

అని హిమవంతు డన్నాడు. ఆ మాటలే ఆ కొండ గుహాంతరాలలోనికి వెళ్ళి ప్రతిధ్వనిస్తూ రెండు మారు లదే మాటలంటున్నట్లుగా వినవచ్చినవి.

అప్పు డా మునులు సంభాషణాదులతో అగ్రణి అయిన తమలోని అంగిరసుని మాటలాడవలసిందిగా కోరారు. అత నా కొండతేని కిట్లా సమాధానమిచ్చినాడు.

"నీ వన్నదంతా నిజమే. అంతకంటె ఉన్నతుడవుకూడా నీవు. నీ శిఖరా లెంత ఎత్తైనవో నీ మనస్సూ అంతే ఉన్నత మైనది. అందువల్లనే నిన్ను స్థావరాత్మకుడవైన హరి వని పెద్ద లనడం అర్థమే. నీ కుక్షిలో మరి చరాచర భూతకోటి దాగి ఉన్నదికదా !

నీవు నీ వ్రేళ్ళను రసాతలందాకా పోనిచ్చి మోస్తు న్నావు కాబట్టి సరిపోయినదికానీ, లేకపోతే తామరతూళ్ళలా లలితములైన తన పడగలతో ఆదిశేషువు ఈ భూమి నెలా మోయగలడయ్యా మహారాజా !

నిరాఘాటధాటితో ప్రవహిస్తూ, సాగర తరంగాలు కూడా ఆపలేని నీలో పుట్టిన నదులూ, అలాంటివే అయిన

నీ కీర్తులూ తమపుణ్యపరిపాకంతో. ఈ లోకములను పునీతం చేస్తున్నవి.

తొలుత ఆకాశగంగ విష్ణుపాదోద్భవయై ఎంతగా ప్రస్తుతి కెక్కెనో, అలాగే రెండవమారు ఉన్నత శిరస్కుడవైన నీనుండి ప్రభవమందికూడా అలాగే శ్లాఘాపాత్రమైనది.

త్రివిక్రమావతారం తాల్చినపుడు హరి మహిమ పైకి, క్రిందికి, ప్రక్కలకు వ్యాపించినది. మరి నీకీ మహిమావ్యాప్తి సహజసిద్ధమైనది. సర్వదా సామాన్యమైనది.

పైగా నీకు యజ్ఞభాగం భుజించే హక్కు ఏర్పడినది. ఇందుతో అంత ఎత్తుగానున్న మేరుపర్వత కాంచన శిఖరం వట్టి గొప్పయే అయిపోయినది. మేరువునకు యజ్ఞభాగ భోక్తలలో స్థానం లేదు కదా మరి !

నీలోని కాఠిన్యమంతా నీవు నీ స్థావరరూపమైన పర్వతంలోనే ఉంచివేసినావు. ఈ నీభక్తి వినమితమైన జంగమ స్వరూపం సజ్జన పూజనీయమైనది. మే మెఱుగమా—

ఇంతకూ మేము వచ్చినపని చెప్తాను విను. అదైనా మా పనికాదు, అదికూడా నీ పనే. కేవలం ఈ శుభకార్య ప్రస్తావనతో మాకూ ఈ మంచిలో కాస్త భాగం సంక్రమిస్తున్నది. అంతే.

అణిమాదిగుణోపేతము, ఇతర పురుషస్పర్శలేనిదీ అయిన ఈశ్వరుడనే గొప్ప పేరుతో సిగపూవుగా నెలవంకను దాల్చిన ఒకానొక దివ్య మహస్సున్నదయ్యా— ఆయన అష్ట

మూర్తులే భూమ్యాదులు. అవి పరస్పర సామర్థ్య ప్రకటనంతో ఈ విశ్వాన్ని ఈ జగద్రథాన్ని అశ్వములవలె సరియైన మార్గంలో నడిపిస్తున్నవి.

తమ శరీరాభ్యంతరాలలో నున్నాడని ఆ ఈశ్వరునే యోగులు అంతశ్చక్షువులతో వెదుకుతూ ఉంటారు. ఆయన దాపును చేరుకుంటే ఇక వారికి తిరిగి సంసారంలో పడవలసిన భయంలేదని పెద్దలు చెప్తారు.

ఆ విశ్వకర్మసాక్షి స్వయంగా నీ కూతును కోరి వరించినాడు. ఆ వరదుడు మా ముఖంగా నిన్ను నీకూతు నివ్వమని అభ్యర్థిస్తున్నాడు.

వాక్కుతో అర్థాన్ని కలిపినట్టుగా, ఆయనతో నీ కూతును కలిపివెయ్యి. సత్పాత్రదత్తమైన పుత్రికనుగూర్చి తండ్రి విచారపడవలసిన అవసరం ఉండదు. ఆ ఈశ్వరుడు జగత్పిత. అందువల్లనే మీ పార్వతి ఈ లోకంలోని సర్వ చరాచర భూతకోటికీ జనని అగుగాక.

దేవతలు ముందు శివునకు ప్రణమిల్లి తదనంతరం ఈమె చరణారవిందాలను తమ చూడామణి మరీచులతో అరుణితం చేతురుగాక.

గౌరి వధువు; నీవు కన్యాదాతవు; మేము పెళ్ళిపెద్దలము; వరుడు ఈశ్వరుడు. ఈ సామగ్రి నీ వంశసమున్నతికి చాలును కదా !

ఒకరితో స్తుత్యుడౌతేగాని, ఒకరిని స్తుతించి ఎఱుగని వాడు. ఒకరితో వందనమందుతేగాని, ఒకరిముందు తలవంచని వాడు అయిన ఆ లోకగురునకు నీ కూతునివ్వడంతో గురువువు కావయ్యా!"

అని ఈ విధంగా ఆంగీరసమహర్షి చెప్తుండగా తండ్రి ప్రక్కనే ఉన్న పార్వతి తన చేతిలోని లీలాకమలపత్రాలను లెక్కపెట్టసాగినది.

తనకోరిక నెఱవేఱినట్టుగా హిమవంతుడు భావించినా తనభార్య మేనక మొగం చూచినాడు. ఇలాంటి కూతురు పెళ్ళిళ్ళ విషయాలలో మామూలుగా గృహస్థులకు తమ భార్యలే ప్రమాణం. దారిచూపవలసివారు వారే. తన మగనికి తృప్తినందించిన ఈ సంబంధం మేనకకుకూడా నచ్చినది. పతివ్రతలు తమ భర్తల మనోభీష్టాలకు వ్యతిరేకలు కారుకదా!

హిమవంతుడు ఆ ముని వచనాలకు సమాధానం ఇలా చేస్తే న్యాయంగా ఉంటుందని తలపోసి, మంగళాలంకార సంశోభితమైన తన కూతు చేయిని పట్టుకొని ఇలా అన్నాడు.

"అమ్మాయీ ఇలారా. విశ్వాత్ముడైన శివునికి నీవు భిక్షగా పరికల్పితవైనావు. ఇదుగో ఈ సప్తర్షులు వచ్చి నిన్నాయన కిమ్మని అడుగుతున్నారు. ఈ విధంగా నాకు సౌగృహస్థధర్మఫలం లభ్యమైనది."

అని ఆ నాలుగు మాటలూ తన పుత్రికతో చెప్పి ఆ మహర్షులతో హిమవంతు డిలా అన్నాడు.

"ఇదిగో ఈ త్రిలోచన వధువు మీకు నమస్కరిస్తున్నది."

ఇట్లా తమ అభ్యర్థన నంగీకరించడంలో ఉదారమైన ఆ పర్వతరాజు మాటలకు వారు ఆమోదం తెలిపినారు. ఆ పార్వతిని తమ ఆశీర్వచనాలతో ముంచి రానున్న సమృద్ధిని సూచించినారు.

తమకు నమస్కరించడంతో చెవిలోని బంగరు కమ్మ జారిపడుతుండగా సిగ్గుపడిపోతున్న గౌరిని అరుంధతి చేరదీసి తన ఒడిలో కూర్చుండబెట్టుకొన్నది.

అయ్యో ఇక తన కూతు మరొకరి అయ్యదిగా అయిపోనుండెను కదా అన్న ఆవేదనతో కంట తడిపెట్టిన మేనకను చూచి అరుంధతి, అనన్య సామాన్యుడైన ఈశ్వరుని గుణగణాలను ప్రస్తుతించి ఆమె శోకాన్ని తొలగించినది. ఇంత గొప్ప సంబంధం వస్తుండగా కంట తడిపెట్టరాదని ఒప్పించినది.

అయితే ముహూర్త మెప్పుడని హిమవంతు డడుగగా మూడునాళ్ళ తర్వాత నాలుగవరోజని చెప్పి, లేచినారు. హిమాధిరాజుతో పోయివత్తుమని చెప్పి, తిరిగి ఈశ్వరుని సందర్శించి అయన కీ సంగతి నివేదించి, ఆయనతో సెలవు తీసుకొని ఆ మునులు ఆకసమున కెగిరిపోయినారు.

ఎప్పుడెప్పుడు పార్వతిని కలసుకొందునా అన్న ఉత్కంఠతతో పశుపతి ఆ మూడు రోజులూ అతికష్టంతో గడపినాడు. ఆ లోకేశ్వరునే ఈ రాగోదయమంత అవశునిచేసి వేసినదికదా, మరి ఇంకెవ్వరి మనసును కలతపెట్టదు ?

ఇది షష్ఠ సర్గ.

## సప్తమ సర్గ

మూడు రోజులు ముగిసినపిదప శుక్లపక్షతిథిచూచి, లగ్నాది సప్తమశుద్ధి చూచి, హిమవంతుడు బంధుసమేతుడై తన కూతు వివాహ దీక్షను నిర్వర్తించినాడు.

రకరకాలైన కుతూహల వివాహ కార్యాలతో ఆ పట్టణ పురంధ్రులందరూ ప్రీతితో ఇంటింటా నిమగ్నులైనారు. హిమవంతుని అంతఃపురమూ, ఆ ఓషధిప్రస్థపురమూ ఆ పర్వత రాజుమీది ప్రీతితో ఒకే ఇంటివలె అప్పుడు తోచినది. అన్ని ఇళ్ళూ పెండ్లి ఇండ్లే అయినవి.

నగర రాజవీధు లన్నిటా మందారకుసుమాలు చల్లినారు. ప్రతి ఇంటిమీదా, శృంగాటకాలలో నూచీనాంశుకములతో ధ్వజాలెత్తినారు. బంగారు తోరణాలు నిర్మించినారు. ఇందుతో అదొక ద్వితీయ స్వర్గంవలె వెలిగిపోయినది.

హిమవంతునకు కొడుకులూ, కూతుండ్రూ చాలమందే ఉన్నారు. అయినా వారిలో పార్వతి ఒక్కటే ఎంతకాలానికో కనులపడినదానివలె, చచ్చి బ్రతికినదానివలె ఆ తండ్రికి వివాహం దగ్గరపడినందువల్ల మరింత ప్రేమాస్పదురాలైనది.

హిమవంతుని బంధువు లందరూ ఆ అమ్మాయిని ఒకొక్కరూ తమ ఒడిలో కూర్చుండబెట్టుకున్నారు. ఒకొక్కరూ ఒకొక ఆభరణం సంతరించిపెట్టినారు. ఆమె అందరికీ పుత్రిక

కాకపోయినా ఆ గిరిరాజవంశంమీదనున్న ప్రేమతో వారం దరూ ఒక ఇంటికి చెందినవారుగానే భావించినారు.

సూర్యోదయానంతరం మూడవదైన సూర్యముహూర్తంలో, ఉత్తరఫల్గునీ నక్షత్రంలో చంద్రుడుండగా బంధుస్త్రీలు పతివ్రతవతులు పార్వతిని అలంకరించడం మొదలిడినారు.

తెల్ల ఆవాలతోనూ, గఱిక మొలకలతోనూ మరింత అందమైన దుకూలాన్ని నాభిదాకా కట్టుకొని, బాణం చేత పట్టుకొని అభ్యంగనాలంకారం ముగించుకున్న ఆ గౌరి దానికే అలంకారమైనది.

బహుళపక్షం ముగిసినతర్వాత భానుకిరణంతో వృద్ధి నందిన శశాంకరేకవలె ఆవివాహ విధిలో బాణం పట్టుకొని ఆ బాల మరింత ప్రకాశించినది.

తర్వాత ముత్తైదువలు లొద్దుగుపుప్పొడితో నలుగు పెట్టి, కాస్త ఎండిన గంధద్రవ్యంతో ఒడలంతా అద్ది అభిషేకానికి తగినవస్త్రం కట్టి ఆ గౌరిని చతుశ్శాలకు అభిముఖంగా స్నానగృహానికి కొంపోయినారు.

వైదూర్యమణులు గచ్చుచేసి అందులో ముత్యాల ముగ్గులు పెట్టి ఉన్న ఆ చతుష్కంలో కూర్చుండబెట్టినారు. బంగారు కుండలతో మంగళవాద్యాలు మొఱయుచుండగా నీళ్ళుపోసినారు.

అలా మంగళ స్నానం ముగించుకొని, ధౌత దుకూ లాన్ని కట్టుకున్న ఆపార్వతి వాననీటితో అభిషిక్తమైన వికసిన తెల్లపూవుతోడి నేలవలె వెలుగొందినది.

అప్పు డక్కడనుండి చాందినీ కట్టి ఉన్న మణిస్తంభాలు నాలుగింటిమధ్యా ఏర్పరచిన అలంకార వేదిక మీదికి పతివ్రత లామెను కౌగిలించుకొని కొనిపోయినారు. ఆ వేదికమీద పీటపై ఆమెను తూర్పుముఖంగా కూర్చుండబెట్టినారు. ఎదు రుగా నిల్చుండి ఆమెనుచూచి ఊరక నే ఇంత అందంగా నున్న అంగనకు మరి అలంకారా లెందుకూ అని కాసేపు ఊరకే ఉన్నారు. ప్రసాధన సామగ్రి అంతా సమీపంలోనే ఉన్నది. అయినా గౌరిని చూస్తే ఏ ప్రసాధనం లేకనే ఇంతబాగున్నదే అని వారి కనులన్నీ ఆమెపైపే ఆకర్షితాలైనవి.

అలంకారం చేస్తున్నవారిలో ఒక అంగన ధూపం వేసి గౌరి నెంద్రుకల తడి ఆర్చినది. సిగలో పూలు తురిమినది. ఆ తర్వాత దూర్వాంకురాలు మధ్యేమధ్యే గుచ్చి పచ్చని మధూక కుసుమదామం చుట్టి అందంగా ముడివేసినది.

ఆ గౌరి ఒడలికి తెల్లని అగురువు పూసి, గోరోచనంతో మకరికాపత్రాలు గీసినారు. అందుతో చక్రవాకాలు సైకత ములపై నిలిచి ఉన్న గంగానదివలె అత్యంత రమణీయంగా కానవచ్చినది.

ముంగురులు పాపట బొట్టుతో ఆమె మొగంపై వ్రేలాడు తున్నవి. అందుతో ఆమె ముఖం తుమ్మెదలతోటి కమలాన్ని,

మబ్బులరేకులుపడిన చంద్రబింబాన్ని మించిపోయినది. అందుతో అది సాదృశ్య ప్రసక్తినే తొలగించివేసినది.

ఆమె చెవిలో యవాంకురాన్ని అవతంసంగా ఉంచినారు. లొద్దుగుపుప్పొడితో బాగా రుద్ది అద్దంలా చేసిన ఆమె కపోలంపై గోరోచనం అలదుటతో అది మరింత అరుణంగా ఉన్నది. ఆ చెంపపై బడి చెవిలోని యవాంకురం మరింత రంగు తేలినది. అందుతో చూపఱ చూపులనెల్లాలాగి వేయదొడగినది.

చక్కని అంగసౌష్ఠవం గల ఆ పార్వతి అధరంపై వారు మధూచ్ఛిష్టంతో నడుమ నొక రేక గీసినారు. అందుతో దాని అరుణిమ మరింత మిలమిల మెరసిపోయినది. తన సౌందర్య ప్రయోజనం త్వరలోనే తీరనున్నదని సూచిస్తూ సన్నగా అదరుతున్న ఆ అధరం ఏదో ఒకానొక అపూర్వశోభను వెలార్చినది.

ఒక చెలి ఆమె అడుగులకు పారాణి పూసినది, "దీనితో శివుని శిరస్సుపై నున్న చంద్రవంకను తాకుదువు లేవమ్మా!" అని పరిహాసపూర్వకంగా ఆశీర్వదించినది. ఆ మాటకు పార్వతి మౌనంగానే మాల్యంతో కొట్టి జవాబిచ్చినది.

చక్కని కలువపూలలా ఉన్న అందమైన ఆమె కళ్ళను చూచి చెలులు 'ఈ కళ్ళకు కాటుక మరింత అందం కల్పిస్తుందని కాదమ్మా, కేవలం మంగళకరమనే ఉంచుతున్నాం —' అంటూ కాటుక పెట్టినారు.

సొమ్ములన్నీ పెట్టి కైసేసినతర్వాత ఉమ పూలుపూసిన తీవెలా, చుక్కలు కాసిన రేయిలా, చక్రవాకాలతో నదిలా

ప్రకాశించినది. అప్పు డామె తన సొగసును అద్దంలో కను లింత చేసుకొని స్తిమిత దృష్టులతో చూచుకొన్నది. ఎప్పు డెప్పుడు శివుని దరియుదమా అని ఉవ్విళ్ళూరినది. ఔనుమరి! స్త్రీల అలంకారానికి ఫలం దానిని ప్రియుడు అవలోకించడమే కదా!

అప్పుడు గౌరితల్లి మేనక మంగళకరమైన పచ్చి హరి తాళ ద్రవాన్ని తీసుకొన్నది. అందుతో పాటు మనశ్శిలనూ బొటనవ్రేలు నడిమివ్రేళ్ళతో తీసుకున్నది. చెవులలో తెల్లటి దంత పత్రాలు పెట్టుకున్న ఆ పార్వతి ముఖాన్ని పైకెత్తినది. ఎలాగో వివాహదీక్షాతిలకాన్ని నుదుట నుంచినది. తన కూతురు కాస్త పెరిగిననాటినుంచీ పెరుగుతూవచ్చిన ఆ కోరి కను — తనకూతు నొక అయ్యచేతిలో పెట్టవలెనన్న కోరికను — ఇలా పూర్తి చేసుకొన్నది.

పిదప తన కనులలో ఆనందాశ్రువులు చిప్పిల్లుటతో ఏమీ కానరాక ఊర్ణామయమైన కౌతుకకంకణాన్ని కట్టబోయి కాస్త ప్రక్కగా ఉంచినది. అదిచూచి, దాది దానిని సరి అయిన తావునకు త్రోసినది. అలా సరిగా కంకణం కూతు చేతిలో కట్టగలిగినది. క్రొత్త పట్టుపుట్టం కట్టుకొని, చేత అద్దం ఉంచుకున్న ఉమాకుమారి అప్పుడు నురుగులతో నిండిన పాలవెల్లినేలవలెనూ, పూర్ణచంద్రికలో శరత్కాల రాత్రి వలెనూ మరింత సొగసులు వోయినది.

మేనక కూతురితో అప్పుడు కులదేవతలకు పూజ చేయించినది. పిదప వరుసగా ముత్తైదువలకు పాదాభివందనం

చేయించినది. మరి ఈ కూతురే కదా తమ కులప్రతిష్ఠాకారకు రాలు. తానుచేయవలసిన పనులెల్లా చేయించ నెరిగిననేర్పరి!

అప్పుడు ఆ వృద్ధ పుణ్యాంగనలందరూ తమకు నమస్కరించిన ఉమకు అక్షతమైన పతిప్రేమ నందుకొమ్మని ఆశీర దించినారు. ఆ పిదప ఆమెపతి అర్ధ శరీరాన్నే అందుకొని ప్రియ బంధుజనుల ఆశీస్సులనే అధఃకరించివేసినది.

కుశలుడూ, సభ్యుడూ అయిన హిమవంతుడు తన ఉత్సాహ వైభవాలకు అనుగుణంగా పార్వతికి సంబంధించిన విధులన్నీ నిర్వర్తించి బంధుజను లందరూ చేరిన సభలో హరుని ఆగమనం ప్రతీక్షిస్తూ ఉండినాడు.

అదే సమయంలోనే కైలాసంలో పాణిగ్రహణానికి ముందు చేయవలసిన ప్రసాధనక్రియ లన్నింటినీ సప్తమాతృకలు శివునకు ఆదరంతో చేయదలచి ఆయనముందు అలంకార సామగ్రి సంతటినీ ఉంచినారు.

ఈశ్వరుడు ఆ అలంకార సామగ్రిని ఆ మాతలమీది గౌరవంతో కేవలం స్పృశించినాడు; అలంకరించుకొనలేదు. ఆయన స్వభావసిద్ధమైన అలంకార సామగ్రే వివాహ సమయానికి అనుకూలమైన అలంకారంగా మారిపోయినది.

ఆయన అలదుకొన్న బూదిపూడే ధవళాంగరాగమైనది. కపాలమే మంచి శిరోభూషణమైనది. గజచర్మమే అంచులు తీర్చిన పట్టాంశుకమైనది.

లలాటమధ్యంలో పిశంగకనీనికతో వెలిగిపోయే మూడవకన్నే హారిదళ తిలకంగా మారినది. ఆ యా ప్రదేశా లలో ఆ యా ఆభరణాలుగా పాములు మారినవి. అయితే వాని శరీరాలే ఆభరణరూపం ధరించినవిగాని, వాని పడగల లోని మణులుమటుకు అట్లానే ఉండిపోయినవి.

ఇక పగలుకూడా వెన్నెల వెదజల్లుతూ సన్నగా ఉన్నందువల్ల లోని మచ్చ కనబడకుండా నిత్యం తలమీద వెలిగి పోయే నెలవంక ఉండగా ఇక హరునకు వేరే చూడామణి పెట్టుకోవలసిన అవసర మేమున్నది ?

ఈ విధంగా స్వమహిమతోనే అన్ని అలంకారాలనూ చేకూర్చుకొని, అత్యద్భుతంగా కానవస్తున్న ఈశ్వరుడు, ప్రమ థులు తెచ్చిన ఖడ్గంలో తనరూపు చూచుకున్నాడు.

తర్వాత పులిచర్మంపైన కప్పిన వృషభం భక్తిభావంతో తన ప్రమాణాన్ని సంక్షేపించుకోనగా నందీశ్వరుని భుజం పట్టు కొని కైలాసంవంటి తన వాహనాన్ని శివుడు అధిరోహించి నాడు. ఆయన బయలుదేరగనే సప్తమాతృకలుకూడా తమ వాహనాల నెక్కినారు. ఆ వాహనాల కదలికతో తమ కుండ లాలు కదలుతుండగా, పరాగగౌరముఖాలతో ఆకసాన్ని పద్మరాగంగా మార్చివేస్తూ వారూ ఆయనవెంటనే వెడలినారు.

వారి వెనుకనే—ఆ కనకప్రభా భాసమానలైన మాతృ కల వెనుకనే - కపాల మాలికలు వేసుకున్న కాళి బయలుదేరి నది. ఆ తెల్లని పుష్పలదంసలు కొంగలబారును తోపింపగా,

ముందు మాతృకలు మెఱపులవలెనుండగా ఆ కాళి నీలపయోధరరాజివలె కానవచ్చినది.

ఆ తర్వాత శివునిముందు త్రిశూలాలు పట్టుకొని నడుస్తున్న ప్రమథగణాలు మంగళతూర్యములను మ్రోయించినారు. ఆ శబ్దం గగనంలోని దేవ విమానాలలో దూరి ఇదే భగవత్సేవావసరమని సురలకు తెలియజేసినది.

సూర్యుడాయనకు త్వష్ట కొత్తగా నిర్మించిన శ్వేతచ్ఛత్రాన్ని పట్టినాడు. ఆ ఛత్ర దుకూలానికి దాపుననే శివుని శిరస్సున్నది గనుక దానిపై గంగాప్రవాహం పడుతున్నదా అని అనిపించినదప్పుడు. గంగా యమునలూ రూపు ధరించి ఆయనకు చామరాలు పట్టుకొని వీవనలు విసరినారు. తమ నదీరూపం వదలినా రాయంచలు వారిని వదలనట్లుగా ఆ వింజామరలు తోచినవి.

హవిస్సుతో వహ్నిని వలెనే తమ జయజయ వచనాలతో ఆయన మహిమను పెంపొందిపజేస్తూ ప్రథమ ప్రజాపతీ, శ్రీమహావిష్ణువూ కూడా స్వయంగా శివసేవకు చనుదెంచినారు.

ఒకే మూర్తి బ్రహ్మ విష్ణు శివ రూపాలతో త్రిధాత్వం పొందినది. వారిలో పెద్దా చిన్నా తారతమ్యం లేదు. ఒక ప్పుడు విష్ణువునకు హరి ఆద్యుడు; మరొకప్పుడు హరునకు హరి మూలపురుషుడు; ఇంకొకప్పుడు వారిద్దరకూ మూలదైవం ప్రజాపతి బ్రహ్మ; ఇంకా ఒకప్పుడు ఆ బ్రహ్మకు వారిరువురూ ఆదిపురుషులు.

తదనంతరం దేవేంద్రాదులైన లోకపాలురు తమవైభవ ప్రాభవ చిహ్నాల నన్నింటిని వదలి, వినీతవేషులై తమకు ఈశ్వరదర్శనం ఇప్పించవలసిందని నందీశ్వరునకు సైగచేస్తూ, ఆయన వారికి శివుని చూపింపగా అంజలిబద్ధులై ఆదిదేవునకు నమస్కరించినారు.

వారివారి ప్రాధాన్యాన్నిబట్టి శివుడు చతుర్ముఖుని తల వంకించుటతోను, హరిని పలుకరించుటతోను, ఇంద్రుని చిఱునవ్వుతోను, ఇతర సర్వదేవతలనూ ఆలోకమాత్రంతోనూ సంభావించినాడు.

సప్తర్షులు శివుని ముందునకు వచ్చి జయాశీస్సు లిచ్చినారు. చిఱునవ్వుతో వారిని పలుకరించి శివుడు "ఈ విశాల వివాహయజ్ఞంలో మీరు ఆధ్వర్యం వహించవలెనని ముందే నేను కోరినాను" అన్నాడు.

విశ్వావసువు అనే గంధర్వుని నాయకత్వంక్రింద వీణా వాదనప్రవీణులు త్రిపుర విజయావదానం గానం చేసినారు. తమోవికారాలకు అలంఘ్యుడైన శివుడు దారినడచినాడు. ఆకాశంలో విలాసంగా నడవగలదీ, కాంచన కింకిణులు గల గల మ్రోయునదీ అయిన వృషభవాహనం మబ్బులదారిలో వెడుతూ నదీతటాలు క్రుమ్మినట్లుగా ఆ మబ్బుముద్ద తన కొమ్ములకు తగుల్కొనగా విదిలించుకుంటూ, ఆ హరుని మోసుకొని వెళ్ళినది.

పరాక్రాంతి కెన్నడూ సాల్పడని హిమవత్పాలితమైన ఓషధప్రస్థనగరం, ముందుకు వెడుతున్న శివుని దృష్టిపాతా

లనే బంగారుత్రాళ్ళతో లాగుకొని వచ్చినట్లుగా చిటికలో దగ్గరపడినది. ఆ ఊరి మొగలో పౌరులు కుతూహలంతో కళ్ళప్పగించి మోరలెత్తుకొని చూస్తుండగా ఆకాశంనుండి దిగి దగ్గరలో నున్న భూమిపై నీరద నీలకంఠుడు శివుడు అడుగు పెట్టినాడు.

ఆయనరాకను చూచి ఆనందంతో గిరిచక్రవర్తి, మహా విభవ సంపన్నులైన తన బంధుజనులు గజబృందముల నెక్కి పూసిన చెట్లతోడి తమ కటకాలవలె నున్న ఆ ఏనుగులతో తనతో రాగా శివునకు ఎదురేగినాడు.

ఆ దేవదేవుల పరివారము, ఈ హిమవంతుని పరివారమూ పురద్వారం తెఱచివేయగా ఉన్న ఒక సేతువూ భిన్నంకాగా ఇరువాగుల ప్రవాహాలు కలుసుకున్నట్లుగా కలుసుకున్నారు.

ముల్లోకాలకూ వంద్యుడైన శివుడు తనకు నమస్కరింపగా హిమవంతుడు సిగ్గుపడిపోయినాడు. అయితే అంతకు పూర్వమే అప్రయత్నంగా శివమహిమతో తనతల చాలక్రిందకు వంగిపోయే ఉన్నదని ఆయన గ్రహించలేకపోయినాడు. సంతోషంతో ముఖ మింతగా వికసితంకాగా ఆ కొండఱేడు జామాత ముందునకు వచ్చి ఆయనను తీసికొని, పాదాలు పూర్తిగా పూలలోనే క్రుచ్చుకొని పోతున్న విపణివీధులగుండా తన మందిరానికి కొనిపోయినాడు. ఆ సమృద్ధగృహంలో ప్రవేశింపజేసినాడు.

ఆ సమయంలో ఆ ఈశ్వరసందర్శనలాలసలైన ఆ పుర సుందరులు మిగత పనులన్నీ ఉన్నవి ఉన్నట్లు వదలివేసి ప్రాసాదాలపై నెక్కినారు. గబగబా గవాక్షంముందుకు వెడుతుండగా ఆ తొందరలో ఒకతె సిగముడి వీడిపోయినది. అందులోని పూలు క్రిందపడినవి. దానిని గట్టిగా చేతితో పట్టుకున్నది. కాని ముడివేసుకొనుటే ఆవిడ మఱచిపోయినది.

ఒకతెకు చెలి కాలికి పారాణి పూస్తున్నది. అలా ఆమె చేతిలోనున్న తనకాలిని వెంటనే లాగివేసుకొని, లీలాగమనం మాని గబగబా కిటికీదాపునకు పరువెత్తి పోతూ ఆ ప్రమద ఆ దారి పొడవునా పారాణిగుర్తులు వేసినది.

మరొక మగువ శలాకతో కాటుకతీసి కుడికంటికి పెట్టుకొన్నది. ఈలోగా ఈ వార్తవిని ఎడమకంటికి కాటుక పెట్టుకొనకుండానే ఆ శలాక నలాగే పట్టుకొని వాతాయనం దగ్గరకు పరువెత్తినది.

గవాక్షంలోనికే చూపులు పోనిచ్చి చూస్తున్న ఒకతె తన పోకముడి జారిపోతున్నా కట్టుకొనలేదు. నాభిలో తన కంకణప్రభలు నిండగ తనచేతితో ఆ వలువను పట్టుకొని చూడ సాగినది. అది కట్టుకొనులోపల శివుడు వెళ్ళిపోవునేమో అని ఆమె ఆందోళన.

ఒకామె తనకాలి బొటనవ్రేలికి దారం చుట్టుకొని పట్టుకొని అందులో మణులుకూరుస్తున్నది. అలాగే లేచి వీధిలోనికి పోవడంలో సరిగా కూర్చని ఆ మణులన్నీ రాలిపోసాగినవి.

6

తుదకు ఆవిడ మొలనూలులో మిగిలినదల్లా కాలి బొటన వ్రేలికి చుట్టుకున్న దారం మాత్రమే.

ఆసవగంధవ్యాప్తములైన ముఖలతో ఆ అతి కుతూహలవతులైన విలాసినుల విలోలనేత్రభ్రమరాలతో గవాక్షములు కమలాభరణములతోవలె ప్రకాశించినవి.

రకరకాల పతాకలతో నిండిపోయిన పెద్దతోరణాలుకల రాజపథంలో ఇందుమౌళి వెడుతున్నాడు. పగలుకూడా వెన్నెల కురిపించి అక్కడి ప్రాసాదశృంగముల నాయన మరింత ధవళ దధీతులతో వెలుగొందజేసినాడు.

ఏకైక దర్శనీయుడైన ఆ శివుని తమ కన్నులతోనే త్రాగివేస్తూ ఆ తన్వంగులు మరొకపనిజోలికి వెళ్ళలేక పోయినారు. వారి ఇంద్రియ వ్యాపారాలన్నీ ఒకే ఒక చక్షురింద్రియం లోనే సర్వాత్మనా చొచ్చుకొనిపోయినట్లున్నవి.

ఆ సమయంలో పురస్త్రీలు వారిలో వారిలా మాట్లాడుకున్నారు.

"ఈయనకోసమని అపర్ణ ఎంత మృదుగాత్రి అయినా అంత దుష్కరమయిన తపస్సుచేయడం కూడా యుక్తమే సుమా! ఈ శివునికి దాస్యంచేసే భాగ్యమబ్బినా ఏ భామిని అయినా కృతార్థురాలవుతుంది. ఇక ఈయన ఒడిలో పడుకొనగల పడతి అదృష్టం చెప్పవలెనా ?

"ఈ సుందరాకారు లిద్దరినీ అన్యోన్యం కలుపకనేపోయి ఉంటే, ఇంత కష్టపడి వీరిని సృష్టించిన ఆ ప్రజాపతి ప్రయత్న మంతా బూడిదలోపోసిన పన్నీరే అయి ఉండును కదా !

"కోపంతో ఈ శివుడు కుసుమాయుధుని శరీరాన్ని కాల్చి వేసెనంటే నేను నమ్మలేనమ్మా! ఈ మహాదేవుని రూపుచూచి సిగ్గుపడిపోయిన కాముడే తనకుతానే దేహసన్యాసం చేసుకొనె నేమో !"

అని ఒకొక రొకొకతీరుగా అన సాగినారు.

అందులో ఒకతె ఒకామెతో ఇలా అన్నది.

"చెలీ ! కోరి కోరి ఈ కొండలతే డీయనను అల్లునిగా చేసుకొన్నాడు ! ఇందుతో, భావహానంతో ముందే ఉన్నత మైన ఈ గిరిరాజు మూర్ధం, ఈ సంబంధంతో మరెంత ఉన్నతం కాగలదనుకుంటానమ్మా !"

ఇలా రకరకాలుగా వినవస్తున్న ఊరి ముత్తైదువుల మాటలను వినుకుంటూ చంద్రశేఖరుడు హిమవంతుని మందిరం చేరుకున్నాడు. అక్కడ చల్లుతున్న ఆచారలా జలన్ని దారిలోనే వచ్చినవారి కేయూరములకు తగిలి పిండి పిండి అయిపోతున్నవి.

ఇంటిముందు శరన్మేఘమునుండి దిగుతున్న సూర్యునివలె, విష్ణువు చేయి ఇవ్వగా వృషభంమీదినుండి దిగినాడు. ముందు నడుస్తున్న బ్రహ్మ దారిచూపగా కక్ష్యాంతరములు దాటుతూ లోనికి వెళ్ళినాడు. ఆయన వెనుకనే ఇంద్రాది దేవతలూ,

సప్తర్షులు మొదలైన మహర్షులూ, ప్రమథాదిగణాలూ ఆ గిరి మందిరంలోనికి చనినారు. ప్రశస్తమైన ఆరంభాన్ని అనుసరించే పరమార్థములవలె వారి గమనం తోచినది.

అక్కడ ఈశ్వరుడు ఆసనంపై కూర్చుండి, యథా విధిగా, మంత్రపూర్వకంగా ఆ గిరిరాజిచ్చిన రత్నపూర్వకమైన అర్ఘ్యాన్ని, మధువుతో కూడిన గవ్యాన్ని, నూతన దుకూలాలనూ అందుకొన్నాడు. ఆ పట్టుబట్టలను కట్టుకొన్న తర్వాత శివుని వినీతులైన అంతఃపురములోని పెద్దలు వధూ సమీపానికి కొనిపోయినారు. నురుగులతో నిండిన సముద్రాన్ని నవ చంద్రకిరణాలు వేలా సమీపానికి కొనిపోయినట్టుగా ఉన్న దప్పుడు.

ప్రవృద్ధ ముఖచంద్రకాంతిలో నున్న ఆ కుమారిని ప్రఫుల్ల నేత్ర కువలయాలతో ఆ శివుడు కలిసినవాడై శరత్తుతో సంగతమైన లోకంవలె ప్రసన్న మనస్సలిలుడైనాడు.

అప్రయత్నంగా కలుసుకొని కాతరము లవుతున్న ఆ వధూవరుల చూపులు కాసేపలా నిలిచి వెంటనే నివర్తితాలవుతూ పరస్పరలోలము లవుతూ సిగ్గుమూలంగా ఆ సమయంలో సంకోచమందినవి.

ఈశ్వరునిచూచి భయపడి ఉమాశరీరంలో దాచుకొన్న మన్మథుని అంకురంవలె నున్న పార్వతి చేతిని హిమవంతుడు తీసి శివునకు అందివ్వగా ఆయన పార్వతీ పాణిగ్రహణం చేసినాడు. అప్పుడు పార్వతి చేతిపై పులకలు మొలిచినవి. శివుని

చేతి వ్రేళ్ళు చెమర్చినవి. ఇలా ఆ పాణిసమాగసమయంలో కామవృత్తి చెరిసగం పంచినట్లయినది.

ఏ వధూవరులకైనా అలాంటి పాణిగ్రహణం సమయములో శివ పార్వతుల సాన్నిధ్యం అత్యంత శోభను కల్పించును గదా! మరి ఆ శివ పార్వతులే అలా పాణిగ్రహణం చేసుకొన్నప్పుడు వారి శోభావిశేష మింతటిదని చెప్పడం సాధ్యమవుతుందా?

ఆ మిథునం నాలుకలుచాచి జ్వలిస్తున్న అగ్నికి ప్రదక్షిణం చేస్తున్నప్పుడు మేరుపరిసరాలలో తిరుగుతున్న రాత్రింబవళ్ళు కలుసుకొన్నట్లు వారు వెలుగొందినారు. ఆ వధూవరులు మూడుమారులు హోమాగ్నికి ప్రదక్షిణం చేసినారు. పరస్పర సంస్పర్శతో వారి కను లరమూతలు వడినవి. పురోహితు డప్పుడు ఆ జాజ్వల్యమానమైన హోమాగ్నిలో వధువుతో లాజాహోమం చేయించినాడు. ఆ లాజాధూమాంజలిని పురోహితుని ఆనతి మేరకు పార్వతి తనముఖానికి అద్దుకొన్నది. అప్పుడు ఆమె కపోలాలను తాకునట్లు శిఖలను చాపిన అగ్ని ఆ కాసేపూ కర్ణావతంసంలా కానవచ్చినాడు. ఆ పొగతో ఆమె చెక్కులు కొంత చమర్చినవి. కొంత ఎఱ్ఱవడినవి. కనుల లోని కాటుకరం గొకింత రంజితమయినది. ఆమె చెవిలోని యవాంకురం కాస్త వాడినది.

అప్పుడు పురోహితుడు వధువుతో ఇలా అన్నాడు. "వత్సా! వివాహానికి అగ్ని సాక్షి తల్లీ! నీ భర్త

అయిన శివునితో పాటు ఇక విచార మేమీ లేకుండా ధర్మాచరణంలో నిమగ్నురాలవు కావమ్మా !''

కనులదాకా చెవుల నింతగా వికసింపజేసుకొని భవాని ఆ గురువచనాన్ని విన్నది. వేసవిలో బాగా తపించిపోయిన భూమి తొలకరి చినుకలను త్రావినట్లుగా చెవులతోనే ఆ మాటలను త్రావివేసినది.

ప్రియదర్శనుడూ, ధ్రువుడూ అయిన తనభర్త ధ్రువ దర్శనం చేయింపగా పార్వతి మొగమెత్తి, సిగ్గుతో గొంతు డగ్గుత్తిక పడగా ఎంతో కష్టంమీద 'కనబడినది' అన్నది.

ఈ విధంగా విధిజ్ఞుడైన పురోహితుడు పార్వతీ పరమేశ్వరుల పాణిగ్రహణ విధిని పూర్తి చేయించినాడు. అప్పుడా ఆలుమగలు ప్రజాపితలు పద్మాసనస్థుడైన పరమేష్ఠికి నమస్కరించినారు.

అప్పుడా పరమేష్ఠి నూతన వధువును "వీరపుత్రవు కా తల్లీ" అని ఆశీర్వదించినాడు. ఆయన వాచస్పతే అయినా అష్టమూర్తి అయిన ఈశ్వరునకు ఏమని దీవన ఇవ్వవలెనో విచారిస్తూ మాటలు తోచక అలా ఉండిపోయినాడు.

తదనంతరం ఆ నూతన దంపతులు పుష్పరచనాదులతో అలంకరించిన చతురస్రవేదిపైకి వచ్చి లోకాచార ప్రకారం ఆర్ద్రాక్షతారోపణం కావించుకున్నారు.

శ్రీదేవి అప్పుడు దళప్రాంతాలలో తగుల్కొన్న జల బిందుజాలనే ముత్యాల సరులు కాగా, నాళమే దండంకాగా

కమలాన్నే వారికి ఆతపత్రంగా పట్టినది తర్వాత సరస్వతేమో సంస్కృత ప్రాకృతాలలో రెండు విధాలా ఉచ్చరించిన మాటలతో ఆ దంపతులను స్తుతించినది. సంస్కృత శబ్దాలలో వరునీ, సుబోధమైన రచనగల ప్రాకృతంలో వధువునూ మెచ్చుకొన్నది.

ముఖాదిసంధులతో, కైశిక్యాది వృత్తి విశేషాలతో శృంగారాది రసానుగుణ రాగవిశేషాలతో, మధురాభినయములతో అచ్చరలాడిన నాటకాన్నికూడా ఆ నవదంపతులు చూచారు.

అలా వివాహమంతా ముగిసిన తర్వాత, దేవతలు కిరీటఘటితహస్తాంజలులై నమస్కరించి, తిరిగి శాపాంతాన సశరీరుడైన కాముని సేవ లందుకొనవలసిందిగా ప్రార్థించినారు.

అప్పటికే కోపం తగ్గిపోయిన ఈశ్వరుడు తన మీాద కూడా కామబాణ ప్రసారానికి అనుమతించినాడు. కార్యవాదులు సమయంచూచి ప్రభువులకు విజ్ఞాపనం చేస్తారు. అలాంటి వినతులు సఫలం కూడా అవుతుంటాయి మరి !

ఇక ఆ దేవతలందరకూ సెలవిచ్చి ఇందుమౌళి పార్వతి చేయి పట్టుకొని, కనకకలశాలతో విచిత్రరచనలతో విరాజిల్లుతూ, భూశయ్య నేర్పాటు చేసిన విలాసాగారంలోనికి వెళ్ళిపోయినాడు.

అక్కడ పార్వతి క్రొత్త పెళ్ళికూతురు గనుక సిగ్గులొలకిస్తూ ఈశ్వరుడు పైకెత్తి పట్టిన ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకొనసాగినది. తన నర్మసఖులతో కూడా ఒకటీ అరగా మాటలాడసాగినది. అలాంటి కన్యను శివుడు ప్రమథుల ముఖవికారాదులను ప్రదర్శించి మెల్లగా నవ్వునట్లు చేసినాడు.

ఇది సప్తమ సర్గ.

# అష్టమ సర్గ

వివాహానంతరం, ఒకవేపు కామేచ్ఛ, మరొకవేపు అతిభయమూ ముప్పిరిగొనగా గిరిరాజతనయరూపం శివుని విషయంలో కామదోహదకారి మనోహరమూ అయినది.

ఆ నవోఢ అయిన పార్వతి పిలిచినా పలుకదు. చెఱగు పట్టుకుంటే వెళ్ళిపోవాలని యత్నిస్తుంది. పడుకుంటే అటు మొగమై శయనిస్తుంది. ఇలా అయినా ఆమె శివునకు వేడుకనే చేకూర్చినది.

ఒకసారి హరుడు దొంగనిద్దుర నటించసాగినాడు. అప్పుడు కుతూహలంతో పార్వతి ఆయనవేపు మొగంచేసినది. అదిచూచి ప్రియుడు చిఱునవ్వుతో కనులు తెరవగా, ఆ బాలిక మెఱుపు మెఱసినట్లు కనులు మూసుకున్నది.

శివుడు ఆమె నాభిదాపున చేయి ఉంచగా, వణికిపోతూ ఆ చేతిని గౌరి అడ్డగించినది. కాని తనంతటే నీవి ముడి విడి పోగా ఆమె దుకూలం జారిపోయినది.

"చెలీ నీవు ఏకాంతంలో భయం విడనాడి శంకరుని సేవింపు" మని చెలులు తన కుపదేశించిన సంగతిని, ఆయన ఎదుటనుండగా మరచే పోయినది.

ఏదోవిధంగా మాటలాడించవలెనని శూలి అసలు సంగతి తెలుసుకోవలసింది లేకున్నా ప్రశ్నించసాగినాడు. అది

చూచి పార్వతి అలా ప్రియుని ముఖంచూచి తల పంకించుట తోనే జవాబివ్వసాగినది.

తన వలువ నాతడు లాగివేయుసరికి సిగ్గుతో శూలి రెండు కనులూ రెండు చేతులతో మూసివేసినది. కాని అతని మూడవ కన్నులాచూస్తుండేసరికి తన ప్రయత్నమంతా వ్యర్థమయ్యేనని ఖిన్నురాలైనది.

చుంబించబోగా ఆమె అధర మందియిచ్చుటలేదు; చేతులు మెల్లగా స్పృశిస్తున్నప్పటికీ, మృదువుగా ఆలింగనం చేసుకున్నప్పటికి, ఎదుకొత్తులు లేనప్పటికి ఈ విధంగా కామోత్తేజకం కాకున్నా ఆ న వో ఢా గ తం శివునకు ప్రీతిజనకమే అయినది.

పెదవి కొఱకకుండా ముద్దిడుకొంటే ఆమె సహించ గలుగుతున్నది; గాయంపడకుండా నఖక్షతంచేస్తే సహిస్తు న్నది. దయాపూర్వకమైన మృదురతాన్నే ఓర్చుకో గలుగు తున్నది. అంతేగాని అంతకుమించిన గాఢత నామె ఓర్చుకొన లేకపోతున్నది.

మరునాడు రాత్రి జరిగిన సంగతులను గూర్చి సఖులు ప్రశ్నించసాగగా, వారి కుతూహలాన్ని పార్వతి తీర్చనేలేదు. సిగ్గుతో చెప్పలేదుగాని ఆ సంగతులన్నీ వారికి వివరింపవలె నని మనసులోమాత్రం త్వరపడుతూనే ఉండినది.

అద్దంలో ప్రొద్దున్నే తన ఒడలిమీద పడిన సంభోగ చిహ్నాలను గాంచి చూచుకొనసాగినది. అందులోనే తన

వెనుకనున్న ప్రియుని ప్రతిబింబం తన ప్రతికృతి ప్రక్కనే కాన వచ్చు సరికి ఆమె సిగ్గుతో ఏమేమో చేసినది.

తన కూతు యౌవనాన్ని నీలకంఠుడు అనుభవించెనని గుఱుతులతో నెరిగి ఆమె తల్లి ఎంతో ఊరటపడినది. పుత్రికలు తమ పతులకు ప్రీతిపాత్రలైనారన్నదే తల్లుల మనసులోని దుఃఖాన్ని శమింపజేస్తుంది కదా !

ఎలాగో కొన్నిరోజులు కాస్త బలవంతంమీదనే శివుడు పార్వతి ననుభవించినాడు. ఆ తర్వాత మెలమెల్లగా ఆ సుఖానికి మఱిగి అందలి రుచి తెలిసినతర్వాత పార్వతి ఇదేదో బాధగా పరిగణించడం మానివేసినది.

ఇక ఉరస్స్థలం నలిగిపోవునట్లుగా ఆమె శివుని ఆలింగ నం చేసుకొనదొడగినది. మగడు ఆసింపగా తన ముఖాన్ని ఆవలకు త్రిప్పుకొనడం మానివేసినది. తన కాంచీదామాన్ని తడవుతున్న తనమగనిచేతిని ఏదో తగిలీతగలనట్లు అడ్డుపెట్టినది.

మొదట భావమాత్ర సూచితంగా ఉండి, తర్వాత ఒకరి యెడల ఒకరికున్న ఔదాసీన్యం పోయి, తర్వాత బాగా గట్టిపడి, ఆ తర్వాత ఒకరిని విడిచి ఒకరు ఒక క్షణం ఉండడా నికి కూడా వీలులేకుండాచేసి ఆ శివపార్వతుల ప్రేమ రహ స్యంగా పరస్పరం అతి గాఢంగా వారిలో నెలకొన్నది.

తనకు అనురూపుడైన ఆ శివుని గౌరి ఎంత గాఢంగా ప్రేమించెనో, ఆయనా అంతే గాఢంగా ఆమెను వలచినాడు.

టౌను మరి గంగ సాగరుని వదలి మరొకచోటికిచేరదు; అలాగా సాగరుడూ, ఆ గంగాముఖరసైక వృత్తిని మానుకోనడు.

కామశాస్త్ర గురువుగా శంకరున కామె శిష్యురాలై ఏకాంతంలో ముల్లోకాలలోని యువతులకున్న కామకళా కౌశలాన్నంతటినీ అధ్యయనం చేసినది. మరి ఆ కళానైపుణినే ఆయనకు గురుదక్షిణగా సమర్పించినది.

గబాలున శివు డామె అధరపల్లవాన్ని పంటనొత్తి విడువగా, బాధతో పాణిపల్లవాలను విదిలించుకుంటూ పార్వతి చంద్రమౌళి శిరస్థమైన నెలవంకపై నిడుకొని కాస్త చల్లదనంతో ఆ బాధను తొలగించుకొనసాగినది.

చుంబనం చేయుటలో ఆమె పాపిట సింధూరం తన మూడవకంట పడగా, తామరపూల వాసన లొలికే ఆమె ముఖ మారుతం ముందే ఆ కన్నునుంచి ధూళి తొలగిపోయేలా ఆయన చేసుకుంటున్నాడు.

ఈ విధంగా ఇంద్రియసుఖమార్గ సేవనంతో శివుడు మన్మథుని అనుగ్రహించినవాడై ఉమాదేవితోపాటు గిరిరాజు భవనంలో ఒక నెలరోజులుమాత్రమే గడపినాడు.

పుత్రికా విరహదుఃఖంతో కాతరుడైన హిమవంతు నెలాగో వీడ్కొని శివుడు అమేయగమనశీలమైన తన వృషభ వాహన మెక్కి ఆమెతోపాటు ఆ పర్వతంలో అక్కడక్కడా విహరింపసాగినాడు.

వాయువేగంగల ఆ వృషభంపై మేరుపర్వతానికి వెళ్ళి నాడు. అక్కడ కొన్నాళ్ళు పార్వతీకుచసంపర్కంతో పూజితములైన కాంచన పల్లవ భంగపర్యంకాలపై భోగించి వానిని సురతమర్దనకమాలనుగా చేసినాడు శివుడు.

పద్మనాభ చరణాంకితాలైన శిలలతోనున్న మందర పర్వత నితంబభాగములలో, నవామృతబిందుసేచనమందిన ఆ తావులలో శివుడు పార్వతీవదనపద్మభ్రమరుడై కొన్నాళ్ళు సుఖించినాడు.

ఆ తర్వాత కైలాస పర్వతంపై ఆ జగద్గురువు విడిసి నాడు. అక్కడ రావణుని సింహనాదంతో భయభ్రాంతయై ఆమె గట్టిగా తన మెడను కౌగిలించుకొనగా నిర్మలములైన శారదచంద్రికలను అనుభవించినాడు.

మలయ పర్వతంపై ఆయన ఉమతో క్రీడిస్తుండగా, చందనలతలను కదలించి, లవంగ కేసరములతో పరివ్యాప్తమై దక్షిణానిలం మధురభాషివలె తన ప్రియురాలి రతిశ్రమను పోగొట్టినది.

ఆ తర్వాత వారిరువురూ జలక్రీడార్థంలో నదిలో దిగి నారు. అక్కడ పార్వతి బంగారు తామరలతో ప్రియుని కొట్టి నది. ఆయనేమో చేతులతో నీరెత్తి తనపై చల్లగా ఆమె కనులు మూసుకొన్నది. ఆ నదిలో తన మొలనూలుకు తోడు చేపలబారు మరొక మొలనూలుగా కానవచ్చినది.

నందనవనంలో శచి అలకలలో ముడుచుకొనే పారి జాత కుసుమాలతో శివుడు ఉమ నలంకరించినాడు. ఆ ప్రసాధనక్రియను సురాంగన లెంతో ఆసక్తితో విలోకించినారు.

ఈ విధంగా భూలోకంలోను, స్వర్గలోకంలోను సుఖమనుభవించి, భార్యాసమేతుడై ఒకానొకప్పుడు సూర్యుడు అస్తమిస్తుండగా గంధమాదనపర్వత వనాంతరంలోనికి క్రీడించుటకై వెళ్ళినాడు.

అక్కడ ఆయన సూర్యుడు సుఖదర్శనీయుడయ్యేనని గమనించి, కాంచనశిలపై కూర్చుండి తన ఎడమచేతిపై ఆనుకొని ఉన్న పార్వతితో ఇట్లా అన్నాడు.

"మూడువంతులు అరుణంగా నున్న నీకనులను చూచి, కమలాల కాంతితో తులదూచి ఇక అవి ముడుచుకున్నా నీకను లుండునుకదా రాత్రి అయినా ఘరవాలే దనుకొన్నాడేమో ప్రియా! అదో సూర్యుడు, ప్రజాపతి జగత్తును ప్రళయకాలంలో ఉపసంహరించుకొన్నట్లు దివసాన్ని ఉపసంహరించుకొంటున్నాడు చూడు.

"సూర్యుడు మునిగిపోగా, అతని కిరణాలు నీటికణాలకు మరింత దూరంకాగా, ఇదో హిమాలయ నిర్ఝరాలు పాపం అంతదాకా తమచుట్టూ ఎండవడిన శీకరాలలో తోచిన ఇంద్రచాపపరివేషాలన్నీ శూన్యంకాగా ఎట్లున్నదో చూడు!

"ప్రియా! తామరల కేసరమాలికలను తిని, మొగాలిటు నటు చేసుకొని, పరస్పరానురక్తాలైన చక్రవాక మిథు

నాలు ఆ సరస్సులో పాపం విడిపడిపోయినవి. వాని నడుమ అంతరం అల్పమైనా ఎంత అనల్పమైనదో చూడు!

"చెలీ సల్లకీతరుగంధవాసితమైన పగటి నివాసాన్ని వీడి గజబృందములు, సాంధ్యకృత్యనిర్వహణార్థమై భ్రమరపంక్తులు దాగిన కమలాలతోడి జలాన్ని తొండములతో పరిగ్రహిస్తున్నవి చూడు.

"ఓ మితభాషిణీ! పశ్చిమదిక్కున వ్రేలాడుతున్న సూర్యుడు ప్రతిబింబింపగా సరోవరజలాలపై ఒకానొక కాంచనసేతువు నిర్మించినట్లు కానవస్తున్నది చూచావా!

"ఇంతదాకా ఆతపతాపాన్ని తీర్చుకొనుటకై బాగా బురద నిండుకొన్న గుంటలలో ఉండిపోయిన కాఱుపందుల గుంపుల మొనగాండ్లదిగో పైకిలేచి వస్తున్నవి. తెల్లని వాని కోఱలు కనుగొన్నావా? ఆ గుంటలోని తామరతూండ్లను విఱిచివేయగా అవి వానిపై తగుల్కొన్నవేమో అనిపిస్తున్నది.

అదిగో ఆ చెట్టుకొనపై నెక్కి కూర్చున్న నెమలిని చూడు. బంగారు నీరువలె తెల్లని పురిఁగొనున్న అది ఎండను అలా త్రాగివేస్తున్నదేమో! అందుకే అది ఆతపవర్ణంతో వెలుగుతున్నదేమో! అందుకే ఆతపం అపహృతమవుతున్నదేమో!

•

"సూర్యశోషితమైన జలంవంటి ఆకాశం, తూర్పున కాసంత దూరం తిమిరం తలసూపగా, కొంచెమే నీరు మిగిలిన సరస్సు వలె కానవస్తున్నది సుమా!

“కోమలీ ! అదిగో ఆశ్రమభూములనుచూడు. జింకలు మెలమెల్లగా పర్ణశాలల ముంగిళ్ళలోనికి వస్తున్నవి. చినచిన్న చెట్లపాదులలో నీరు కానవస్తున్నది. వనాలకు వెళ్ళిన ధేనువులు తిరిగీ వస్తున్నవి. సాయం హోమార్థం రగుల్కొల్పిన హోమాగ్నులు వెలిగిపోతున్నవి. ఈ సాయంవేళ ఈ మునితపోవనాలెంత శోభాయమానంగా నున్నవని !

“తామరలు ముడుచుకొన్నవి. కాని తనలో దూరి నిలువదలచుకొన్న తుమ్మెదకోసం ప్రీతితోనేమో తామర కాస్త సందించినదేకాని పూర్తిగా ముడుచుకొని పోలేదు సుమా !

అదిగో పరిమిత కిరణాలతోనున్న సూర్యబింబంతో పశ్చిమ దిక్కాంత ఎలా ఉన్నదో చూడు. కేసరములతోడి బంధుజీవకుసుమాన్ని తిలకంగా ఉంచుకున్న కన్యకలా ఉన్నది కదూ అది ?

అదో కిరణోష్ణాన్ని పానంచేసే వేలకొలది వాలఖిల్యాది ఋషులు అగ్నిలో తన తేజస్సుంచిన సూర్యుని ఆయన రథాశ్వ మనోహరస్వనాలతోపాటు సామగానాలతో సంస్తుతిస్తున్నారు.

దినాన్ని మహాసముద్రంలోనుంచి, ఆనతశీర్షములై, తమ చామరాలు ముకుళితనేత్రాలకు తాకగా నొగలతో మెడమీది రోమాలు ఒరసుకొనిపోగా సూర్యాశ్వాలు ముందుకు వంగిపోతున్నవి. సూర్యుడూ అస్తమిస్తున్నాడు.

"అదిగో సుదతీ! సూర్యుడస్తమించగనే గగనం నిదురిస్తు న్నట్టయిపోతుంది. ఔను ఏ తేజస్సు సంగతైనా అంతే. అదున్నంత దాకా తన చుట్టూరా ప్రకాశింపజేస్తుంది. అది పోగానే ఆ ప్రాంతం నిమీలితమయిపోతుంది.

"అదిగో సంధ్యాదేవికూడా సూర్యబింబాన్ని, పూజ్యమైన దానిని అస్తశిఖరంపై నుంచి తానూ దాని ననుసరించి నది. ఔనది యుక్తమే. ఉదయించునప్పుడు సూర్యుడు ఈ సంధ్యను తన ముందుంచుకొని గౌరవించినాడు. మరి ఇప్పుడాయనను అనుసరించకుండా ఎలా ఉంటుంది?

"ఓ కుటిల కుంతలా! అవిగో రకరకాల రంగులతో, ఎఱ్ఱగా, పచ్చగా, కపిశవర్ణంతో నానావర్ణాలుగానున్న మబ్బు ముక్కలను చూస్తున్నావా? నీవు వానిని చూస్తావుకదా అని అంతగా వానికి రంగులద్ది ఆ సంధ్యాదేవి అలంకరించి ఉంచినదేమో!

"ఆ సూర్యుడు పోతూపోతూ తన సంధ్యాతపాన్ని సమానంగా పంచాడేమో అనిపిస్తుంది- అటుచూడు. పర్వతాల మీది సింహాల జూలులో, చివురించిన చెట్లలో, ధాతు రంజితాలైన శైలశిఖరాలలో అన్నిటా సమంగా పంచిపెట్టినట్టు లేదా?

"అదుగో! తపస్వులు, పవిత్ర జలాంజలుల నొసంగి, విధిజ్ఞులైనవారు తమ ఆత్మ పారిశుధ్యంకోసం సంధ్యాకాలంలో గాయత్రీ మంత్రం జపిస్తున్నారు.

"కాబట్టి ఓ ప్రియభాషిణీ! నేనుకూడా సాంధ్యనియమ నిర్వర్తనం కోసం కాసేపు వెళ్ళి వస్తాను. నన్నందుకు అనుమతించు. ఈ ఇంతసేపూ నీ చెలులున్నారుకదా నిన్ను వినోదింపజేస్తారు."

అని ఈశ్వరుడు పార్వతితో అన్నాడు. శైలరాజతనయ మాత్రం పెదవిని విఱిచి, భర్తమాటలను విననట్లుగా తన ప్రక్కనున్న విజయ అనే చెలితో అనవసరంగా ఏదో మాటలాడ దొడగినది.

శివుడుకూడా సంధ్యావిధులను మంత్రపూర్వకంగా అనుష్ఠించినాడు. తిరిగివచ్చుసరికి తన్ను వదలి వెళ్ళినని అసూయతో ఉలకకుండా పలకకుండా ఉన్న పార్వతితో ఇట్లా అన్నాడు:

"అనవసరకోపనా! ఈకోపం చాలించు. నేను ప్రణమితుడ నైనది సంధ్యతోనే. చక్రవాకంలా ఉన్న నీసహధర్మచారిని నన్నుచూడవేమి?

"ఓ సుతనూ! స్వయంభువు సృష్టించిన పితరులలో సూక్ష్మతనువైన ఈ సంధ్యను విడిచినాడు. ఉదయం, సాయంకాలం ఈ సంధ్యకు నమస్కరించడం జరుగుతున్నది. ఈ సంజెపై అందుకే నాకు గౌరవం.

"ఓ అద్రిరాజతనయా! అదిగో ఆ సంధ్య ఒకవేపు తూరుపున చీకటిమూాక పెరిగి వీడిస్తున్నది. అందుకే పర్వత

తటాలపై తమాలమాలవలెనూ, ధాతురసనదీమతల్లివలెనూ ఉన్నదీ సంజ. చూడు ప్రియా!

"పశ్చిమదిక్కు మిగిలిన సంజయెండను రక్తలేఖవలె ధరించి ఉన్నది. సంగ్రామ భూమిలో రక్తసిక్తమైన మండలాగ్రం వలె ఆ ఆతపం కానవస్తున్నది.

"రజనీదినసంధిలో ప్రభవించిన ఈ సాంధ్య తేజస్సు మేరువు అడ్డువచ్చి అంతర్హితం కాగా ఇక తనకత్తి కడ్డులేదని ఈ చీకటి దిక్కులన్నిటా అల్లుకొని పోతున్నది.

"పైకిచూడ వీలులేదు, క్రిందికిచూడ వీలులేదు. చుట్టూ కానరాదు; ముందూ వెనుకాకూడా చూపు ఆనదు. రాత్రి కాగానే ఈ తిమిరసంఛన్నమైనలోకం గర్భవాసంలో ఉన్నట్లుగా ఉంటుంది.

"పరిశుద్ధమైనదీ, కలుషమైనదీ, అస్థిరమైనదీ, చంచలమైనదీ, వక్రమైనదీ, చక్కగానున్నదీ-ఇదీ అదీ సర్వం ఈ చీకటితో సమానమే అయిపోయినది చూడు. ఛీఛీ. మంచీ చెడూ ఏకంచేసే ఈ దుర్మార్గుల ప్రభావం దారుణం సుమా!

"తప్పకుండా యజ్వానాంపతి చంద్రుడు ఈ శార్వరీ తమోనిబర్హణార్థం ఉదయిస్తాడు. అందువల్లనే అదిగో పూర్వదిశాముఖం మొగలిపుప్పొడితో అలదినట్లుగా తెల్లవడినది చూడు.

"అదిగో మందరపర్వతంమాటున చంద్రుడుండగా తారకలతో ఈ నిశ ఎట్లున్నదో చెప్పనా? నీవు నీ చెలులతో కలిసి

మాటలాడుతుండగా వెనుకనిలిచి నేను పొంచి వింటున్నట్టుగా ఉన్నది.

"చీకటిపడినదాకా చెప్పవద్దని రాత్రి అనే స్త్రీ పూర్వ దిక్కుతో ఏదో రహస్యం చెప్పినది. ఆ రహస్యాన్నామె ఇప్పుడు చెప్తున్నదేమో! అందుకే అదో కొంలదిగా కనబడు తున్న ఆ చిరువెన్నెల చిరునవ్వు ముందుతోపగా, చంద్ర మండలాన్ని చిన్నగా బయల్పడజేస్తున్నది.

"ప్రేంకణ ఫలంవలె అదుగో ఆకాశంలో ఎఱ్ఱగానున్నాడు చంద్రుడు. మరి వాని ప్రతిబింబమేమో సరోవరజలంలో కాన వస్తున్నది. ఈ రెంటికీమధ్య చాలా వ్యవధానమున్నది. కాబట్టే ఈ బింబ ప్రతిబింబాలు రేయి విడిపోయిన చక్రవాక మిథునంలా ఉన్నవి.

"అదిగో ఆ నవోదిత చంద్రకిరణాలు యవాంకురాలవలె లలితంగా నున్నవి. అందువల్లనే ఆ కోమల కిరణాలను నీవు నీ కొనగోళ్ళతో గిల్లి నీ చెవిలో అవతంసాలుగా పెట్టుకొన వచ్చును సుమా!

"చంద్రుడు తిమిరమనే కేశసంచయాన్ని తన కరములతో పట్టుకొని, సరోజకుట్మలమాలనే కళ్ళను మూసుకొనగా రజనీముఖాన్ని ముద్దిడుకొంటున్నాడు.

"పార్వతీ అదో నభస్థలాన్ని చందమామ తన కిరణా లతో పూర్తిగా చీకటిని తొలగించి ప్రసన్నంచేసినాడు. అందు

వల్లనే ఏనుగులు మునిగి కలుషితం చేసిన మానస సరస్సు తేరిన రీతిగా నున్నది గగనస్థలం చూడు.

"ఇపుడు చూడు ప్రియా! చందమామ తన అరుణిమను వదలి, పరిశుద్ధు డవుతున్నాడు. నిర్మల ప్రకృతులైనవారికి కాలదోషంవల్ల కలిగినవికారం స్థిరమెన్నటికీ కాదు కదా!

"అదో చంద్రప్రభ ఏమో ఉన్నతమైనవానిపై నిలిచినది. చీకటేమో నిమ్నమైనవాని నాశ్రయించినది. గుణదోషగతి ఎప్పుడూ వారి వారికి తగినట్లే పరబ్రహ్మ విధించి ఉంటాడు.

"ఈ కొండమీది చంద్రకాంతమణులు చంద్రకిరణ స్పర్శతో కరగి జలబిందువులు వర్షిస్తున్నవి. వానితో కటకము నందలి తరువులపై నిద్రిస్తున్న నెమళ్ళు పాపం అకాలంలో మేల్కొంటున్నవి.

"కల్పవృక్ష శిఖరాలపై చంద్రకిరణాలు వెలుగొందు తున్నవా! వానితో చంద్రుడు హారములను మార్చవలెనని కుతూహలపడుతున్నాడేమో అని తోస్తుందికదా! అతిలోక సుందరీ!

"ఈ కొండ ఏమో కొన్నిచోట్ల ఎత్తుగా, కొన్నిచోట్ల తగ్గుగా ఉన్నదా-మరి దీనిపై వెన్నెల ఎత్తైనచోట్ల పడుతూ, లోతైనచోట్ల నీడలు పడుతూ ఉన్నవి. అందువల్లనే ఈ వెలుగు నీడల కలయికతో ఈ వెన్నెలమదకరిపై బూడిదతో రకరకాల రచనలు చేసినట్టుగా ఎన్నెన్ని తీరులనో కానవస్తున్నది ప్రియా!

"గట్టిగాపీల్చి త్రావివేసిన చంద్రకాంతిని తనలో దాచు కొనజాలకపోయినదేమో ఈ కలువ పుటుక్కునపగిలి విరిసి పోతున్నది. అందులో తగుల్కొని ఉండిన తుమ్మెద లొక్క మాటు బయటపడి ఝుంకారం చేస్తున్నవి.

"ఇదిగో ఈ కల్పతురువులమీద వ్రేలుతున్న అంశుకా నికీ, ఈ వెన్నెలకూ భేదమే తెలియడం లేదు. గాలి వచ్చినప్పుడు ఆ అంశుకం కదలడంవల్లనే అది అంశుకమని, ఇది వెన్నెల అనీ బోధపడుతున్నది.

"ఇవిగో ఈ చెట్లక్రింద పండుటాకులతోపాటు కలిసి పడి ఉన్న ఈ వెన్నెల వెలుగులు పూలవలె కోమలంగా ఉన్నవి కదూ! వీనితో నీ అలకలను అలంకరింప వీలవునట్లున్నది.

"ఓ చారువదనా! కొత్త పెండ్లికొడుకులాంటి ఈ చంద మామ, కొత్త పెళ్ళికూతురువలె భయంతో బిత్తరపోయి వణకుతున్న యోగ్యతారకమైన చంచల మండలంతో సం యోగం చెందుతున్నాడు చూచితివా?

"ఓ ప్రియా! నీవు చంద్రబింబంపై చూపు మోపగా, నీ కనులలోపడిన వెన్నెల పండి విరిసిన తెల్లువలె తెల్లనై సహజ సిద్ధంగా ప్రసన్నములైన నీ చెక్కిళ్ళపైనికి ఆరోహిస్తున్న ట్లున్నది.

"అదిగో గంధమాదన వనాధిదేవత, సూర్యకాంతమణుల పాత్రలలోనుంచి, కల్పవృక్షమధువును స్వయంగా నీకోసం తీసికొనివస్తున్నది. ప్రాణేశ్వరీ! అసలు నీ ముఖం స్వభావతః తడికేసరాల వాసన గలది. పైగా నీ కనులూ సహజరక్తవర్ణ

రంజితాలే ! మరి ఇక నీవు ఈ మధురసం ఆస్వాదించినా అం దుతో కలిగేమత్తు ఈ గుణాలకంటె వేరుగుణాల నిక కల్పించ గలది మాత్రమే మున్నది ?

"అయినా సఖిజను లెంతో భక్తితో తెచ్చినారు. ఈ కామోద్దీపకమైన మధువును ఆరగించే చూడు—" అంటూ శంకరుడు ఉదారంగా చెప్పి అంబికతో మదిరాపానం చేయించి నాడు. ఆ మదిరాపాన జనితమైన వికారం కూడా ఉమాదేవికి ఒక వినూతన మనోహరతనే చేకూర్చినది. ఏవో కొన్ని సం స్కార విశేషాలవల్ల మామూలు మామిడిచెట్టు గున్నమామి డిగా మారి సువాసనలు వెదజల్లుతుందికదా !

వెంటనే ఆ సువదన సిగ్గు తొలగించి, కామం పెంచి, వడుక పుట్టించే ఆ మత్తుతోనూ, ఆ మదహరునితోనూ ఆకృష్టయై వారిరువురకీ వశంగతురాలై పోయినది.

కనుగ్రుడ్లు త్రిప్పుతూ, మాటలు తడబడుతూ, చెమ ర్చుతూ, వెఱ్ఱిగా నవ్వుతూ ఉన్న పార్వతి వదనాన్ని చాలసేపు శివుడు తన కనులతోనే పానంచేసినాడు.

అంతలో శివుడు ధ్యానంతో కావలసిన సదుపాయ సామగ్రిని కల్పించినాడు. వెనువెంటనే బంగారు మొలనూలు జారిపోతుండగా, జఘనభారంతో నడువలేకున్న పార్వతిని చేతులతో నెత్తుకొని శివుడు మణిశిలాగృహంలోనికి ఏకాం తంగా ప్రవేశించినాడు.

అక్కడ రాయంచలవలె తెల్లగానున్న దుప్పటి పరచి నట్టి, గంగాసైకతతలంలా మనోహరంగా కానవస్తున్నట్టి

పర్యంకంపై ప్రియురాలితో పాటు, రోహిణీపతి చంద్రుడు శారదాభ్రంపైవలె పడుకొన్నాడు.

వెంద్రుకలన్నీ చిక్కువడి పోయినవి. చందన చర్చంతా చెదరి రాలిపోయినది. ఎక్కడబడితే అక్కడ గోటిగిచ్చులు పడినవి. కాంచీదామం తెగిపోజొచ్చినది — ఆ పార్వతి రతి మచ్చరంతో మరింత పెచ్చరిల్లి ఆ శివుని కెంతయినా తనివితీర్చ లేక పోయినది.

చుక్కలు వాలిపోగా కేవలం తన ప్రియురాలిమీద జాలితో ఆ కల్యాణిని కావలించుకొని శివుడు కనులు మూసుకొన్నాడు - కాస్త కనుకూర్కినాడు.

బుధస్తవాలతో లేవవలసిన ఆ శివుడు, అనేక మూర్ఛనలతో కైశిక్యాది వృత్తులలో ఉషఃకాలంలోనే కిన్నరులు మంగళగీతులు పాడగా బంగారు కమలాల కొలకులతో పాటు ఆయనా మేల్కాంచినాడు.

వారు, ఆ పార్వతీ పరమేశ్వరులు కాసేపు పరస్పరాలింగానాన్ని కాస్త సడలించినారు. మానస సరస్సు తరగలను కదలించి, కమలాలను విరియజేస్తూ వస్తున్న గంధమాదన వనాంతమారుతాలను కాసేపు సేవించినారు.

తటాలున శివునిచూపు పార్వతీదేవి తొడలపైపడిన నఖక్షతమార్గంపై పడినది. అప్పుడు జారిన చీరను సరిజేసుకుంటున్న ప్రియురాలి నాయన వారించినాడు.

నిద్రలేక పార్వతికనులు బాగా అరుణారుణాలై ఉన్నవి. ఆమె అధరంపై లోతుగా దంతక్షతవ్రణా లున్నవి. ఆమె

ముంగురులన్నీ చెల్లాచెదరై చిక్కుపడిపోయి ఉన్నవి. ఆమె నుదుటిమీద తిలకం చెఱగిపోయి ఉన్నది. ఇలాంటి ప్రియురాలి ముఖం వేకువనే చూచి రాగవంతుడైన శివుడెంతో అనురక్తుడయినాడు.

పర్యంకంపై పరచిన దుప్పటి నలిగిపోయి వున్నది; ర్వతి మేఖలసూత్రరహితమై అంతా ఒకచోటచేరి కుప్పగా డకపై పడి ఉన్నది. ఆమె చరణాలమీది పారాణి గురుతులెల్ల ఉలా పడి ఉన్నవి. ఆ పడకను బల్లుమని తెల్లవారినా శివుడు డువనే లేదు.

క్షణ క్షణం సంతోషాన్ని ఇనుమడింపజేస్తున్న ఆ ప్రియాముఖరసాన్ని రాత్రింబవళ్ళు సేవింపదలచిన శివుడు, స్వామి ర్శనానికై ఎవరో వచ్చిరని వచ్చి విజయ అనే నర్మసఖి లియజేసినా ఎవ్వరికీ చూడ పిలుపడదని చెప్పివేసినాడు. వరికీ దర్శన మివ్వనే లేదు.

రాత్రికీ పవలుకూ భేదమనేది లేకుండా అక్కడ పార్వతీసంగమోత్సుకుడైన శివుడు నూరు ఋతువులను ఒకే ఒక రేయిలా గడపివేసినాడు. అయినా ఆ సురతసుఖాలపై ఆయనకు ఆశ తీరనే లేదు.

సముద్రాంతరంలో నుండే బడబానలం ఆ సాగరజల సంతతితో చల్లవడనట్లే ఆ శివుని రాగాతిరేకత పార్వతీసంగంతో తగ్గిపోనే లేదు.

ఇది అష్టమ సర్గ.

కాళిదాసకృత కుమారసంభవభాగం

సర్వం సంపూర్ణం.

| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106, B146, |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | - NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] 106, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | theme |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |